

# విధివంచితులు

ముద్దంశెట్టి హనుమంతరావు

నవోదయ పబ్లిషర్సు

విజయవాడ 2

## ఇందులో

నరహరి తమ్ముడు, సీతభర్త అయిన 'దయానిధి' పూర్తి పేరు 'అనంత దయానిధి'. ఆతడు కొన్ని పేజీల తర్వాత చివరి వరకూ 'అనంతం' అనే పేరుతోనే వ్యవహరిస్తాము. పాఠకులు గమనించ గోర్తాము.

—పరిచురణకర్తలు.

# విధి వంచితులు

చీకటి తెరల్ని కప్పుకుంది లోకం. వీధుల్లోని విద్యు ద్దీపాలు అప్పుడే వెలిగాయి. మందమందంగా వీస్తున్న వాయువులకి చెట్లఆకులు గల గల మంటున్నాయి. నర హరి వాలుకుర్చీలో కూచుని సేద దీర్చుకుంటున్నాడు. వంటింట్లో పనిని చూసుకుని, చీర చెంగుతో చేతులు తుడుచుకుంటూ వచ్చింది కమల.

"ఇవాళ ఉత్తరాలేమీ రాలేదు కమలా?" అన్నాడు నరహరి.

"లేదండీ! మా అమ్మదగ్గర్నించి ఉత్తరం వస్తుందని ... కళ్ళు కాయలుకాచేలా యెదురు చూస్తున్నానుగాని ...డం లేదు" అంది కమల.

"ఎందుకు రాయలేదో, యేమిటో! లేకపోతే మీ ...మ్మడిని రాయమంటే అతడు బద్ధకించి ఊరుకున్నా...

డేమో! అతడి తరహాయే వేరుగావుంది. ఇట్లా తయారవు తాడని నేనెప్పుడూ అనుకోలేదు" అన్నాడు నరహరి.

అదే సమయంలో వీధిలో రిక్షా ఆగింది. ఆవేళప్పుడు ఎవరొస్తున్నారా అని దంపతులిద్దరూ ఆశ్చర్యపోయారు. నరహరి లేచి కాస్త ముందుకి వచ్చాడు. కమల అతని వెంట నడిచింది.

రిక్షానుండి యశోదమ్మ దిగింది. ఆమెను అకస్మాత్తుగా చూసేసరికి ఆ దంపతుల ఆశ్చర్యం ఇనుమడించింది. కమల రెండడుగులు ముందుకువేసి "ఏవమ్మా! ఏమిటి యింత అకస్మాత్తుగా వచ్చావు? వచ్చేముందు ఓ ఉత్తరం ముక్కయినా రాయలేదేం?" అంది ఆత్రుతగా.

యశోదమ్మనుండి జవాబు రాలేదు. "తమ్ముడు రాలేదేం?" మళ్ళీ అంది కమల. యశోదమ్మ మౌనంగా రిక్షావాడికి డబ్బులిచ్చేస్తూ, కంటతడి పెట్టుకుంటూ యింట్లోపలికి నడిచింది. కమలకి ఆత్రుత, గాభరా, భయం ఉద్భవించాయి. నరహరికూడా విస్తుపోయాడు.

"ఏమిటత్తయ్యా, అలా కంటతడి పెట్టుకుంటున్నావు? ఏమయింది?" అన్నాడు. అత్తగార్ని అనుసరిస్తూ. "మాట్లాడవేవమ్మా?" యింట్లోకి వెళ్ళిపోయింతర్వాత మళ్ళీ అడిగింది కమల ఆత్రుతగా. తల్లి కంటతడి[illegible]డంలో అంతరార్థం ఆమె వూహించలేక తమ్ముడికేమైనా ప్రమాదం జరిగిందేమోనని [illegible]ంగా వుండలేకపోయిందా సందర్భంలో.

యశోదమ్మ కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది. ఒకొక్క కన్నీటి బిందువూ చెంపలమీదుగా జాలువారుతుంది.

"ఏం చెప్పేదమ్మా! ఆ వెధవ నా కడుపున పుట్టక పోయినా బాగుండేది. చచ్చినా బాగుండేది, ఒక్కసారి గట్టిగా యేడ్చి వూరుకుందును." రుద్ధకంఠంతో అంది.

"ఏమిటమ్మా ఆ అఘాయిత్యపు మాటలు?" అంది కమల చలిస్తూ.

"నా బాధ, ఆవేదన, నీకేం తెలుసునమ్మా" అంటూ పొంగివచ్చే దుఃఖాన్ని బలవంతంగా ఆపుకుంది యశోదమ్మ "ఒక్కగాని ఒక్క కొడుకని ముద్దుముచ్చట తీరాలని యెంతో గారాబంగా పెంచాం. మీ నాన్నగారు పోయాక ఆ గారాబమంతా వాణ్ణి చెడగొట్టింది. పూర్తిగా బండబారి పోయాడు. లక్షణంగా చదువుకోమంటే, ఆ చదువుని సగంలో అలా తగులబెట్టాడు. పోనీ వుద్యోగంలో చేరాడు, అలాగైనా కాస్తంత బాధ్యత తెలుసుకుంటా డేమోనంటే, అదీ లేదు. ఒక్క నెలకూడా పూర్తిగా జీతం యిచ్చిన పాపానపోడు. వాడి సరదాలూ, భోగాలూ, యీ వయస్సులో నేకదా అన్న తలంపుతో యెంత తెచ్చిస్తే అంతే తీసుకొనేదాన్ని. ఎందుకింత తక్కువని ఒక్కనాడు యెదురుప్రశ్న వెయ్యలేదు. ఆ నా మంచితనమే ఈనాడు నన్ను వెక్కిరిస్తోంది. నన్ను నడివీధిలో నిలబెట్టి పరువు తీస్తోంది. ఆనాడే వాణ్ణి కట్టుదిట్టాల్లో వుంచితే, ఒక క్రమపద్ధతిలో పెడితే, యీరోజు యిలా జరిగేది కాదేమో" అంది యశోదమ్మ అంతులేని దుఃఖంతో.

యశోదమ్మ మనసులోవున్న బాధనీ, ఆవేదననీ బలవంతగా అణచుకొందుకు ప్రయత్నిస్తున్నదనీ, చెప్పాలనుకున్నది చెప్పలేకుండా వుందనీ గ్రహించాడు నరహరి.

"ఇంతకీ అసలు విషయమేమిటో చెప్పవేమత్తయ్యా. భానుమూర్తి ప్రస్తుతం యెక్కడున్నట్టు?" అన్నాడు.

"అదే తెలియదు నాయనా! వెళ్ళిపోయి మూడు రోజులయింది. ఎక్కడికి వెళ్ళాడో అర్థంకాకుండా వుంది. కాని, వూళ్ళోవాళ్ళు మాత్రం ..." ఆగిపోయింది యశోదమ్మ.

అత్తగారు తనకి చెప్పడానికి శంకిస్తుందనీ, తనదగ్గర యేదో విషయాన్ని దాస్తోందనీ, నిర్ధారణ చేసుకున్నాడు నరహరి.

"నాదగ్గర దాపరిక మెందుకత్తయ్యా! సంశయిస్తా వెందుకు? చెప్పు. యేంజరిగిందో సవిస్తరంగా చెప్పు. వెళ్ళిపోయాడని, మనకి పట్టనట్టుగా వూరుకుంటే యెట్లా?" అన్నాడు.

"చెప్పమ్మా! ఆయనకంటే మనకింక ఆప్తులైనవారున్నారు?" అంది కమల చెమ్మగిల్లిన కళ్ళను ఒత్తుకుంటూ.

అల్లుడి మనస్తత్వం యశోదమ్మకి తెలుసు. తనకి ఆ పరిస్థితుల్లో ఆదుకోవల్సినవాడూ, ఆదరించి ధైర్యం చెప్పగలిగినవాడూ, అతనేననికూడా ఆమెకు తెలుసు. అలాంటి వ్యక్తియెదుట తనకొడుకుచేసిన అవినీతిపనిని వెల్లడి చెయ్యకుండా వుండాలని హెచ్చరిస్తున్న తన అంతరాత్మను

నిందించుకుంది. "నీ దగ్గర దాపరికమెందుకు నాయనా? ఊళ్ళోవాళ్ళంతా అనుకోవడమేమిటంటే, మా యింటెదురుగా వుండే అమ్మాయిని లేవదీసుకు పోయాడని. ఈవార్త నిప్పులా వూరంతా ప్రాకిపోయింది. ఆ అమ్మాయి తండ్రి రౌద్రుడై నా దగ్గరికొచ్చి నోటి కొచ్చినట్టు వాగాడు. నేనేం చెప్పగలను? అతనికున్న బాధే నాలోనూ నిండివుంది. చివరికి నా పరిస్థితిచూసి, చక్కా తిరిగి పోయాడు. ఇంక నేనా వూళ్ళో యెలా మొహం పెట్టుకు తిరగ్గలను చెప్పు నాయనా? అందుకే, యెవరికీ చెప్పకండా యింటికి తాళంవేసి యిలా వచ్చేశాను. మేమింత వరకూ ఆవూళ్ళో యెంత నీతిగా, యెంత గౌరవంగా బ్రతికామో, యిప్పుడంతగా తల దించుకోవల్సిన స్థితి యేర్పడింది. వంశోద్ధారకుడే విఘ్నంగా మమ్మల్ని వుద్ధరించాడు. ఎవరితో చెప్పుకోనడం? చెప్పడానికున్నా సిగ్గు చేటుగా వుంది. ఇవన్నీ కళ్ళారా చూడ్డానికే గామోసు, భగవంతుడు నన్ను సజీవంగా వుంచాడు?" సజల నేత్రాలతో అంది యశోదమ్మ.

ఆమె బాధని అర్థంచేసుకున్నాడు నరహరి. కన్న బిడ్డల ప్రతి తప్పునీ క్షమించి, సహరించే మాతృమూర్తి అలా బాధపడుతుందంటే, ఆమెలో యెంత ఆవేదన నిక్షిప్తమైవుందో అర్థంచేసుకున్నాడు.

"అతడిలా తయారవుతాడని నేనేనాడూ అనుకున్నానత్తయ్యా! మొదట్నుంచీ గారాబంగా పెంచడమే ముప్పు తెచ్చిపెట్టింది. అదుపులో పెట్టేవాళ్ళెవరూ లేకపోయారు.

మొక్కప్పుడే వంచాలిగాని, మానయ్యాక అది వొంగు తుందా? మనపెద్దలు చెప్పిన సుద్దులేవీ పొల్లుపోవు" అన్నాడు నరహరి.

"అందుకేకదా నాయనా, వాడికి పెళ్ళిచేసేస్తే, అప్పుడైనా బాధ్యత తలమీదపడి దారి కొస్తాడేమోనని, ప్రయత్నించాను: నువ్వేమో సరస్వతిని వాడికివ్వనని ఒక్కటేపట్టు పట్టుకూర్చున్నావాయె, ఏంచేస్తాను: యిదంతా నాఖర్మ...." అంటూ వాపోయింది యశోదమ్మ.

ఇల్లాంటి నిష్ఠూరం యెప్పుడో ఓసారి అత్తనోటినుండి వినాల్సి వస్తుందని యేనాడో వూహించాడు నరహరి.

"నువ్వు దూరంగా ఆలోచించలేదత్తయా! పెళ్ళి చేసేశామే అనుకో, ఇప్పుడతడిలా పలాయనమయ్యాడు గదా, మా అమ్మాయిగతి యేమయ్యుండేది? ముక్కు పచ్చలారని దాని బ్రతుకులో చీకటిముసురుకునేది కదా! ఒక్కగాని ఒక్కపిల్ల. దానిసుఖం చూడలేక పోయినా, దుఃఖాన్నంతా పంచుకోవాల్సిందే కదా! అమ్మాయినివ్వడానికి నాకేం అభ్యంతరం లేదని యేనాడో చెప్పాను. కాని, అతడి ప్రవర్తన రోజు రోజుకీ శృతిమించి రాగాన పడిందని తెలిసికూడా ఎలా అమ్మాయి గొంతు కొయ్యమంటావు?"

యశోదమ్మ మాట్లాడలేక పోయింది. తన కొడుకు యందు అభిమానం, అనురాగం వున్నా, అతడు చేసిన పనులను, అతని తిరుగుళ్ళని సమర్ధించలేక పోయింది. తన

కొడుకు మంచివాడని గుండెమీద చెయ్యివేసి చెప్పగలిగే ధైర్యం లేకపోయిందామెలో.

అప్పుడే సరస్వతి వంటగదిలోంచి వచ్చింది. అమ్మమ్మను చూసి "ఏం మామ్మా! కులాసా?" అంటూ యశోదమ్మకి దగ్గరగా వచ్చింది.

"ఏం కులాసాలే అమ్మ! రా....కూచో" అంటూ మనవరాల్ని తనప్రక్కనే కూచోబెట్టుకుని, ఆప్యాయంగా తల నిమిరింది యశోదమ్మ. ఆమె కళ్ళు నీళ్ళపర్యంతమయ్యాయి. పసిడిబొమ్మలాంటి మనవరాల్ని కోడలిగా చేసుకోలేకపోయాననే అన్న ఆ వేదన ఆమెలో రగిలింది

"మావయ్య రాలేదా?" అంది సరస్వతి అమాయకంగా.

"లేదమ్మా రాలేదు...." అని మాత్రమే అన గలిగింది యశోదమ్మ దుఃఖాన్నంతా దిగమింగుకుని. కొడుకు గావించిన అప్రాచ్యపు పని వివరించడానికి మనసొప్పలేదు. సరస్వతికి ఆ విషయం తెలిస్తే, కొడుకుని యేవగించుకొంటుందని ఆమె భావం. అయితే ఆమెకి తెలియకుండా వుంటుందా? కాని-తనుగా చెప్పదల్చుకో లేదు.

ఆ ప్రస్తావన యింక పొడిగించడం ఇష్టంలేదు నరహరికి. కూతురికి అవన్నీ తెలియడం మంచిదికాదనుకుని గామోసు.

"అలానిలుచ్చున్నావేమిటి కమలా? మీఅమ్మమ్మకి కాస్త కాఫీ తెచ్చి యివ్వు" అని విషయం మార్చేశాడు.

"కాఫీ తీసుకురావడానికి లేవబోయింది సరస్వతి"

"ఇప్పుడేంవద్దులే తల్లీ! కాసేపు పోయాక భోజనం యెలాగూ చేస్తానుగా" అంటూ అక్కణ్ణించి లేచింది యశోదమ్మ. కమల తల్లిని వెంటతీసుకుని వంటగదివేపు నడిచింది. సరస్వతి అమ్మమ్మ సామాను సర్దిపెడుతోంది.

"అమ్మాయ్...." అన్నాడు నరహరి.

"ఏం నాన్నా" అంటూ తండ్రి యెదుటకి వచ్చింది సరస్వతి.

"మీ రిజల్ట్సు యెప్పుడొస్తాయని అనుకుంటున్నావమ్మా?" అన్నాడు.

"ఈ వారం పదిరోజుల్లో రావచ్చునని అనుకుంటున్నారు నాన్నా!"

"నువ్వు తప్పకుండా పాసవుతావన్న నమ్మకం నాకుంది. మీ హెడ్ మిస్ట్రెస్ కూడా ఆమాటే అంటోంది. పైచదువు చదివించమని సలహాకూడా యిచ్చింది."

"సలహాలకేంలెండి. ముందీ పరీక్ష విషయం తేలనివ్వండి. తర్వాత కార్యక్రమం తీరిగ్గా ఆలోచించుకోవచ్చు...." అంది సరస్వతి.

"చదువుకోవాలన్న ఆసక్తి నీలో వుండాలేగాని, నాకేమీ అభ్యంతరం లేదమ్మా" అన్నాడు నరహరి.

"సరూ!" అన్న తల్లి కేక వినిపించడంతో "వస్తానుండండి" అంటూ లోపలికి వెళ్ళిపోయింది సరస్వతి.

వెళ్ళిపోతున్న కూతుర్నిచూస్తూ నవ్వుకున్నాడు

నరహరి. ఒక్కగాని ఒక్క కూతుర్ని బాగా చదివించి మంచివరుణ్ణి వెదికి పెళ్లిచెయ్యాలి. ఆమె మంచి హోదాతో, అంతస్థుతో జీవితం గడుపుతూవుంటే, చూసి ఆనందించాలి. అంతకంటె తనకి కావల్సిందేమీ లేదు.... అనుకున్నాడు.

నిజం చెప్పుకోవాలంటే నరహరికి యీ ఆశయం యేనాటినుండో అంతర్గతంగావుంది. ఉన్నది వున్నట్టుగా భార్యతోకూడా యెప్పుడూ అనలేదు. అదే కారణంతో సరస్వతిని బావమరది భానుమూర్తికిచ్చి వివాహం చేసేందుకు ససేమిరా ఒప్పుకోలేదు. సమయస్ఫూర్తిగా సాకులు సృష్టించి మంచి మాటలతో తప్పించుకున్నాడు.

ఆలోచనలు అలల్లో తేలుతున్న నరహరికి, హెడ్ గుమాస్తా కబురుపంపటం జ్ఞప్తికి వచ్చింది. చప్పున లేచి షర్టు తొడుక్కున్నాడు.

"కమలా!" కేక వేశాడు.

"ఏమండీ!" అంటూ వచ్చింది కమల.

"నేనలా మా హెడ్ గుమస్తాగారింటికి వెళ్లొస్తాను."

"అదేమిటండీ! మా అమ్మ యిప్పుడే వచ్చింది కదా, మాటా మంచీ లేకుండా యెక్కడికో వెళ్తానంటారేమిటి?" అంది కమల వింతగా భర్తకేసి చూస్తూ.

"ఇప్పుడే వచ్చేస్తాగా! అయినా మాట్లాడవల్సిందింకా యేముంది కమలా!"

"అలా అంటారేమిటండీ! మీరు మరీను. మా

తమ్ముడి విషయం యేంచెయ్యాడమో అందరం కలిసి మాట్లాడుకోపోతే యెట్లా?"

"అలాగే మాట్లాడుకుందాం. నేనేం అక్కడ కాపురం పెట్టబోవడం లేదుగదా! యిప్పుడే వచ్చేస్తాను" నవ్వుతూ అన్నాడు నరహరి.

"వేగిరం వచ్చేయండి. అన్నట్టు వచ్చేటపుడు ఓ ఒక పౌను కాఫీపొడరు తీసుకురండి..."

"ఇంకా ఏం చెప్పడం లేదే అనే చూస్తున్నా."నవ్వుతూ అనేసి బైటికి నడిచాడు.

"మీ ఆయన యెక్కడికి వెళ్తున్నాడే?" అనుకుంటూ వచ్చింది యశోదమ్మ.

ఇంకెక్కడికి వెళ్తారమ్మా! ఇంటిపని చెయ్యాడానికి ముప్పయిమూడు మూలులు మూలుగుతారుగాని, అదేమో అధికారి పిలవగానే తొంభైసార్లన్నా విసుగూ, విరామం లేకుండా తిరుగుతారు". సమయం చిక్కింది కదా అని ఓ విసురు విసిరింది. కాని ఆ విసురు ప్రయోజనం యేమిటో ఆమెకే తెలియాలి. వినేవ్యక్తి యెదుట వుంటేగా!

యశోదమ్మ చిన్నగా నవ్వుకుంది.

"వేగిరం వచ్చేయమన్నావా?" అంది.

"చెప్పానమ్మా, వచ్చేస్తానన్నారు".

"కమలా! నిన్నో విషయం అడగాలనుందే!"

"ఏమిటమ్మా!" తల్లి మొహంలోకి చూస్తూ అంది కమల.

నీ కూతుర్ని నీ స్వంత తమ్ముడికిచ్చి పెళ్ళి చెయ్య

డం మానేసి, పరాయివాళ్ళకు కట్టబెట్టాలని నువ్వు ప్రయత్నిస్తున్నావటే? నరహరి దూరంవాడు గాబట్టి అభిమానం వుండకపోతే పోతుంది కాని. తమ్ముడన్న అభిమానం, ఆత్మీయతా, నీకన్నా వుండొద్దూ?"

కమల గట్టిగా నిట్టూర్చింది. తల్లి యెప్పుడైనా తననీ ప్రశ్న అడుగుతుందని ఆమెకి తెలుసు. కాని, తన అసహాయతని తల్లికెలా నచ్చ జెప్పడమో, బోధపడక కాసేపు తర్జన భర్జన పడింది.

"నాలో యేముందమ్మా? నీకు తెలిసిందేగా. మీ అల్లుడు నా అభిప్రాయాలకు పీసమెత్తయినా విలువివ్వరు. ఆ మధ్య నే నీ విషయం ప్రస్తావించేసరికి యిప్పుడు నీకు చెప్పినట్టే నాకూ చెప్పారు. ఎదురు ప్రశ్నలు వేశాను. ఏంజవాబు చెప్తాం? ఇంతకీ మనవాడి ప్రవర్తన బాగుంటే, యీ సమస్యలేవచ్చేవి కావుగా; ఆయనగారికి యిప్పుడిదో సాకు దొరికింది."

"ఈ ప్రవర్తన కలకాలం వుంటుందటే. పెళ్ళయితే వాటికవే సర్దుకుపోతాయి. వాడి వునికి తెలుసుకుని యిప్పుడన్నా సరస్వతిని ముడికట్టేస్తే, అదే వాణ్ణి ముక్కుకి తాడు గట్టి ఓ మూల కూచోబెడుతుంది. ఆడది తల్చుకుంటే చేయలేనిదంటూ ఏముంది? దాని వల్లనయినా సన్మార్గుడిగా మారిపోతాడేమో ఆలోచించు కమలా! స్తనం పంచుకున్న సోదరుణ్ణి, యిలా వదిలేయడం నీకు న్యాయం కాదు. సరస్వతిపై తండ్రిగా మీ ఆయనకి యెంతహక్కూ, అధికారం వున్నాయో, కన్నతల్లిగా నీకూ ఆ హక్కూ,

అధికారం వున్నాయ్. నువ్వు గట్టిగా పట్టుబట్టి చెప్పా వంటే ఆయన కాదనడేమో!" అంది యశోదమ్మ కూతుర్ని బోధపర్చడానికి ప్రయత్నిస్తూ.

కమలకి తెలుసు తల్లి లోలోన అనుభవిస్తున్న ఆవే దన యేమిటో కాని, తల్లి యింకా ఆ ఆశ పెట్టుకోవడం, కమలకి ఆశ్చర్యం వేసింది. "పరిస్థితులు అవకతవగ్గా వున్నా యమ్మా. ప్రస్తుతం, ఆ ప్రస్తావన తీసుకు రావడానికే భయంగావుంది. ఆయన యెంత శాంతస్వరూపుడో అంత కోపిష్టికూడాను. ఎవరినో లేవదీసుకు పోయిన వాడికి నాకూతుర్ని కట్టబెట్టమంటావా?' అని యెదురు ప్రశ్నవేస్తే మనం యేం జవాబు చెప్తాం? తెలిసి ఆ విషయం రేకెత్తిం చటం మంచిది కాదమ్మా. ముందు తమ్ముడి ఉనికి తెలి యనీ; తర్వాత విషయం ఆపైన ఆలోచిద్దాం." అంది కమల.

యశోదమ్మ మాట్లాడలేకపోయింది. ఒకసారి పడిన అవినీతిముద్ర చెరుపుకోవడం సాధ్యం కాదనుకుంది. కొడుకు చేసినపనికి తను యేమీ అనలేకపోతుంది. తల్లి గాబట్టి కాని యెవరైనా యెందుకు సమర్థిస్తారు? వాడి జీవితంలో యిదో మాయని మచ్చ. ఆ జీవితం అంతే.... అనుకుంటూ లోలోన కుమిలిపోయింది యశోదమ్మ. ఆ మెకళ్లు నీళ్ళ పర్యంతమయ్యాయి. తల్లి అవస్థను కళ్ళారాచూళ్ళేక వంటగదివేపు పోయింది కమల.

యశోదమ్మ వచ్చి నాలుగు రోజులయింది. కొడుకు జాడ యేమీ తెలియకపోవడం ఆమెను మరింత

కలవరపాటు కలిగించింది. ఎక్కడికి పోయాడో, యెలా వున్నాడో, యేమయ్యాడోనన్న ఆందోళనతోపాటు భయం కూడా పుట్టింది. క్షణక్షణానికీ కొడుకు జ్ఞప్తికి వస్తున్నాడు.

ఓ రోజు సాయంత్రం అయిదు గంటలనుండి వర్షం ప్రారంభమైంది. ఒక పట్టాన వదిలేట్టు అగుపించలేదు. మార్కెట్టుకి వెళ్ళాలని బయల్దేరి నరహరి వెళ్ళలేకపోయాడు. బట్టలు మార్చేసి గడపలో వాలుకుర్చీ వేసుకుని జారబడ్డాడు.

యశోదమ్మ ద్వారం దగ్గరనుంచుని "ఏం నాయనా! అబ్బాయి సంగతి రేమైనా తెలిసిందా?" అంది మెల్లిగా.

"లేదత్తయ్యా! మన బంధువులు కొందరికి వుత్తరాలు రాశాను. మద్రాసులోవున్న స్నేహితుడికి, మనవాడి రూపు రేఖలు వరిస్తూ అతడు అగుపిస్తే ఉత్తరం రాయమనా! ఆ మహానగరంలో యెవరి కెవరో! అయినా మన తృప్తికో రాశాను. విజయవాడలో మన రామనాథం వున్నాడుగా వాడికే రాశాను. రెండు మూడు రోజుల్లో జవాబుల రావొచ్చు." అన్నాడు నరహరి.

అతను యింత ఉపన్యాస మిచ్చినా ఆమెకు సంతృప్తి కలిగించే అక్షరం ఒక్కటీ అందులో విన్పించలేదామెకు.

"వీళ్ళందరికీ ఉత్తరాలు రాస్తే ప్రయోజనమేముంది నాయనా!" అంది నిరుత్సాహంగా.

అత్తగారి అభిప్రాయం యేమిటో నరహరికి అవగతం కాలేదు.

"మరి యేం చెయ్యమంటావత్తయ్యా?" అన్నాడు.

"పత్రికల్లో వేస్తే మంచిదేమో నాయనా!" అంది.

'ఈ యిరవయ్యో శతాబ్దంలో మనిషివై యుండి కూడా ఆపాటి జ్ఞానం లేకపోయిందటయ్యా?' అన్నట్టుందా మొసలహో.

నరహరి చిన్నగా నవ్వాడు.

"ఆ విషయం నాకూ తెలుసునత్తయ్యా. తప్పిపోయిన వాడినీ, తగువు పడి యింటినుండి వెళ్ళిపోయిన వాడినీ రప్పించడానికి పత్రికా ప్రకటన ఉపకరిస్తుంది గాని, కామాంధకారంలో కొట్టుకుపోతూ, గౌరవం ప్రతిష్ఠ, మంచీ, చెడూ, వీటితో ప్రమేయం లేనట్టుగా సంచరించే వాళ్ళను యీ ప్రకటనలు మార్చలేవత్తయ్యా! నీ పిచ్చిగాని, ప్రకటన చూసి మాత్రం తిరిగి వస్తాడని నమ్ముతున్నావా? ప్రకటన చూసినా చూడనట్టే పత్రిక మడిచేస్తాడు. ఉనికి తెలిస్తే మే వెళ్ళి తీసుకురావడం ఉత్తమోత్తమం" అన్నాడు హరి కాస్త కోపంగా.

దూరంగా యోచిస్తే అల్లుడు చెప్పిందే సబబుగా వున్నట్టు తోచింది యశోదమ్మకి. మౌనం వహించింది.

"అయితే అత్తయ్యా, మనవాడిప్పుడు లేవతీసుకుపోయిన అమ్మాయి మన కులం పిల్లేనా?" అన్నాడు నరహరి.

"కాన్నాయనా, మనవాళ్ళే! ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకుంటానని వాడు పట్టుపడితే, నేను మాత్రం వద్దంటానా? లక్షణంగా యిద్దరికీ వివాహం చేసే దాన్నిగా! ఈ పాడుబుద్ధి వాడికెందుకు పుట్టిందో నన్నిలా దుఃఖపెట్టడానికీ, వాడిలా అధోగతిపాలుగావడానికీను" అంది బాధగా.

"పోనీ, తీసుకువెళ్ళినవాడు ఆ అమ్మాయిని యే దేవా

లయంలోనో, పెళ్ళిళ్ళ రిజిష్ట్రారు ఆఫీసులోనో, పెళ్ళిచేసు కొని తిరిగి వచ్చేస్తే బావుణ్ణు" అన్నాడు తన బాధ్యత కొంత తగ్గుతుందన్న వుద్దేశంతో నరహరి.

"ఔను నాయనా, అదీ నిజమే. అలా తిరిగి వచ్చినా బావుణ్ణు. ఆ అమ్మాయిని నువ్వు చూశావో లేదోగాని లక్షణంగా వుంటుంది. చదువుకుంది. కట్నాలూ, కానుకలూ, యిప్పుడెలాగా రావు గనుక, వాటి విషయం యిప్పుడెం కులే." అల్లుడు ఆ మాటన్నందుకు సంబరపడుతూ యశోదమ్మ.

అంతవరకూ ఓపిగ్గా నుంచుని అంతా వింట కమల "కాస్త ఓపిక పడితేసరి! తీసుకెళ్ళినవాడు. పెళ్ళి కోకుండా వదుల్తాడా ! మనసులు కలిశాకనేగా ఒక నిర్ణయ నికి వచ్చారు వాళ్ళు !" అంది.

నరహరి మెల్లగా నవ్వేడు. "అది మనం చెప్పలేం కమలా ! ఈ అధునాతన యుగంలో, ప్రేమకు పిలువ లేకుండా పోయింది. క్షణికమైన వుద్రేకాలతో, ప్రేమికుల మంటూ బోరలు విరుచుకొని దొంగచాటుగా యిళ్ళనుండి పలాయనమవ్వడం, క్రమంగా ఒకరిమీదొకరికి మమకారం, మోజు తగ్గిపోవడం యెంత త్వరితగతిని మనసులు అతు కున్నాయో అంత త్వరగా మనసులూ, మనుష్యులూవిడి పోవడం మనం చూస్తూనే వున్నాంగా" అన్నాడు.

నరహరి చెప్పిన థియరీని ఖండించి, మరోలా సర్ది చెప్పే ధైర్యం యశోదమ్మకుగాని, కమలకుగాని లేకపోయింది.

వర్షం యింకా కురుస్తూనే వుంది. అప్పుడప్పుడు వురుములూ, మెరుపులూ ప్రకృతిని హెచ్చరిస్తున్నయ్. రివ్వు రివ్వుమంటూ గాలి వీస్తోంది.

"గాలి జోరయింది. కిటికీ తలుపులు మూసెయ్యి కమలా ?" అన్నాడు నరహరి. కమల అక్కణ్ణుంచి [illegible]యింది.

"అన్నట్టు, ఆ అమ్మాయి యేమన్నా వుత్తరం రాసిం[illegible] వాళ్ళని అడిగి తెలుసుకుంటే బావుంటుందేమో [illegible]నా !" అంది యశోదమ్మ ఆలోచనల్లో తను యెవరికీ తీసిపోలేదన్న నమ్మకంతో. "ఔను సుమా ! కాని యెవరు వెళ్ళి అడుగుతారత్తయ్యా ? నువ్వు అడుగుతావా ?"

"ఆ వూళ్ళో, కనీసం ఆ వీధిలో అడుగు పెట్టడానికి నాకు మొహం చెల్లడంలేదు నాయనా ! నువ్వే మరి అడుక్కోవాలి. అలా వెళ్ళి మా యింటి తాళాలు పక్కింటి వాళ్ళకిచ్చేసి, అద్దెకియ్యమని చెప్పాలి" ప్రాధేయపూర్వకంగా అంది యశోదమ్మ.

నరహరికి ఆ వూరు వెళ్ళి ఆ అమ్మాయిగారింటికి వెళ్ళడం యిష్టంలేదు. అయినా అత్తగారికి సహాయం చేసే వాళ్ళూ, చేయూత నిచ్చేవాళ్ళూ, యింకెవ్వరూ లేరుగనుక, తనే ఆ బాధ్యతను నెత్తిన పెట్టుకోక తప్పదనుకున్నాడు.

"సరే, అలాగే వెళ్తాను" అన్నాడు సాలోచనగా.

యశోదమ్మ అక్కణ్ణించి లోపలికి పోయింది. నరహరి గట్టిగా ఓమారు నిట్టూర్చాడు. భానుమూర్తిపై కోపం వుప్పెనలా పొంగింది. అతడు వెళ్ళిపోవడం కాదుగాని, తనని యిరకాటంలో పడేశాడు అనుకున్నాడు విసుగ్గా.

సరస్వతికి మేనమామ విషయం క్రమంగా తెలిసింది. ఆమెతో యెవరూ చెప్పలేదుగానీ, తల్లిదండ్రుల మాటలధోరణి అంతా అవగాహన చేసుకుంది. మామయ్య అలా యెందుకు మారిపోయాడో తెలుసుకోలేక పోయింది. సరస్వతి మనస్సాక్షిగా చెప్పాలంటే, ఆమెకి భానుమూర్తంటే యెలాంటి దురభిప్రాయమూ లేదు. అతనిలో చెడుగుణాలున్నాయని తండ్రి అంటున్నా, ఆమె మాత్రం నమ్మేదికాదు. కాని, తండ్రిని ముఖాముఖి యెదిరించే మనోధైర్యం లేకపోయింది. భానుమూర్తి రూపురేఖలు, యెప్పుడూ కళకళ్లాడే ఆ మొహం, ఆ ఠీవి సరస్వతి కళ్ళల్లో యిప్పటికీ మాసిపోలేదు. కాని, ఆమె మనసు మాత్రం గాయపడింది. మామయ్య, పరాంగనపతి అయిపోయాడు. దీనికి యెవరు బాధ్యులో ఆమె చప్పున వూహించుకోలేక పోయింది. తన దురదృష్టానికి లోలోన బాధపడింది.

# 3

బెజవాడ పట్నంలో పేరుపొందిన పెద్ద హోటల్లో ఓగది....గదిలో మంచం, రెండు కుర్చీలూ, నిలువుటద్దం వున్నయ్. సావిత్రి మంచంమీద కూర్చునివుంది. ఆమె మొహంలో కళాకాంతులు వెదికితే అగుపించడంలేదు. ఆ లేత వయస్సులో, అబల కుండాల్సిన వుత్సాహం, ఆనందం, తేజస్సు ఆక్షణంలో మాత్రం అగుపించలేదు. మొహం తెల్లగా పాలిపోయివుంది.

భానుమూర్తి కుర్చీలో కూర్చుని, కిటికీగుండా శూన్యంలోకి చూస్తున్నాడు. అంతుచిక్కని ఆలోచనల్లో కొట్టుకొంటున్నట్టు అతని మొహమే చెప్తోంది. కళ్లల్లో ఆవేదన దోబూచులాడుతోంది.

సావిత్రి అతనివైపు ఓసారి వీక్షించింది. భానుమూర్తి మాత్రం ఆమెవైపు చూళ్ళేదు.

"మీరింత తెలివితక్కువగా ప్రవర్తిస్తారని నేనెప్పుడూ అనుకోలేదండీ మూర్తిగారూ!" అంది బాధగా.

"నేనా!" అన్నాడు తృళ్ళిపడినట్టు మూర్తి.

"ఔనండీ! చేతిలో ఓ అయిదు వందలు అయినా లేకుండా యీ సాహసానికి యెలా వొడిగట్టారో, నాకు బోధపడ్డంలేదు." అంది సావిత్రి.

భానుమూర్తి కొద్దిగా బాధపడ్డాడు. "ఈ నింద బలవంతంగా నామీద వేస్తే నేనేమీ చెప్పలేనుగాని, దూరంగా యోచిస్తే నీదే తప్పు. నన్ను యీ సాహసానికి ప్రోత్సాహపరిచింది నువ్వు. మనజీవితాల్తో చెలగాటలాడ్డం మంచిదికాదని, పెద్దల్ని నచ్చజెప్పి పెళ్ళి చేసుకుందామని యెంత చెప్పినా వినిపించుకున్నావు కాదు. ఎక్కడికైనా పోయి హాయిగా జీవిద్దామని ఆశలు చూపించావు. నాలో లేనిచొరవనీ, ధైర్యాన్నీ కలిగించావు. నా పౌరుషాన్ని రేకెత్తించావు. అలాంటి నువ్వు డబ్బు తీసుకురాకండా వుంటావని నేనెలా అనుకుంటాను? అయినా నేనస్వతంత్రుడనన్న విషయం నీకు తెలిసిందే. నా దగ్గర అప్పటికున్న పైకంతో వచ్చేశాను. ఇందులో నా తప్పేముంది సావిత్రీ?" అన్నాడు.

సావిత్రి యింకేమీ మాటాడలేక పోయింది. భానుమూర్తి అలా భావించడంలో అసహజం యేమీ లేదనుకుంది. ఉద్యోగం వదులుకోడానికి యిష్టపడక, తల్లిని విడిచిపెట్టి రావడానికి సమ్మతించక సందిగ్ధావస్థలో పడివున్న భానుమూర్తిని రెచ్చగొట్టి, ప్రయాణం కట్టించింది తనే. తనకోసం నిజంగా భానుమూర్తి యెంతో త్యాగం చేశాడు. అతణ్ణి యిప్పుడు నిందించడంకంటే, తనని తనే నిందించుకోవడం మంచిదనుకుంది. గట్టిగా ఓ నిట్టూర్పు విడిచింది.

"సరేలెండి. ఎవరితప్పయితేనేం. జరిగిపోయిందానికి బాధపడ్డమెందుకు? ఇదిగో, నాదగ్గర యీ ఆభరణాలన్నీ

వున్నాయిగా! ఒకొక్కటీ కరగబెడదాం...." అంది సావిత్రి నిబ్బరాన్ని తెచ్చిపెట్టుకుంటూ.

భానుమూర్తి చిన్నగా నవ్వేడు. ఆ నవ్వులో యెంతో ఆవేదన నిండివుంది.

"అలా యెన్నాళ్ళు గడపగలం సావిత్రీ! ఒకదాని తర్వాత మరొకటి అమ్మజూపితే అన్నీ నిండుకున్నాక కర్తవ్యం యేమిటి?" దూరంగా ఆలోచించి అన్నాడు భానుమూర్తి.

"అదీ ఒక సమస్యే అనుకోండి. ఈలోగా మీరేదేనా ఉద్యోగం కోసం ప్రయత్నిస్తారు."

"ఉద్యోగం దొరుకుతుందన్న ఆశ దూరంలోనన్నా అగుపిస్తుందా అని?"

"ప్రయత్నించకుండా మనమెలా చెప్పగలమండీ! ఆ తర్వాత మన అదృష్టం" అంది.

భానుమూర్తి కాసేపు మౌనం వహించాడు. తనకి వుద్యోగం దొరకడ మెలా? అన్నదే అతనిలో మెదుల్తున్న ఆలోచన. 'సంవత్సరాల తరబడి సర్టిఫికెట్లు పట్టుకొని కాళ్ళు బలపాలు కట్టేటట్టు ఆఫీసుల వెంట తిరిగే నిరుద్యోగుల సంఖ్య అసంఖ్యాకంగా వున్న యీ రోజుల్లో, ముక్కూ, మొహం తెలియని యీ వూళ్లో ప్రయత్నిస్తే మాత్రం తనకి యే ఉద్యోగం దొరుకుతుంది?' అనుకున్నాడు. ఇవన్నీ ఆలోచిస్తూ వుంటే భవిష్యత్తు యెంతో భయంకరంగా అగుపించిం డతనికి.

"మనం చాలా పొరపాటు చేశాం సావిత్రీ! ఈ

విధంగా లేచిపోయి రావడం సంఘం దృష్టిలో మనం తప్పు చేసిన వాళ్ళమే! ఆ తప్పు అలా వుండగా, భవిష్యత్తయినా సుముఖంగా వుంటుందన్న నమ్మకం లేదు. ఏఁవిటో నాకు అంతా అయోమయంగా వుంది. మన పెద్దల్ని ప్రాధేయపడి, ఒప్పించి, శాస్త్రరీత్యా వివాహం చేసుకొని వుంటే ఎంతో ఆనందంగా వుండేది. మనం అనాలోచితంగా, తప్పటడుగు వేశాం." అన్నాడు బాధగా.

సావిత్రి దీర్ఘంగా, నిట్టూర్చింది. ఆమె కళ్ళల్లో నీరు పాదరసంలా మెరుస్తోంది. "నా బాధ మీకు తెలీదు మూర్తి గారూ! నే నెందుకింత మూర్ఖంగా, అవిసీతి అనైనా ఆలోచించకుండా, సంఘానికి యెదురీత యీదానో మీకు తెలీదు. ఆ విషయమంతా మీకు చెప్పగూడదనుకునే మరుగు పర్చాను కాని యిప్పుడు చెప్పక తప్పడం లేదు." అంది బాధగా.

"ఏఁవిటది?" వింతగా చూస్తూ అన్నాడు భానుమూర్తి.

"సాంప్రదాయ కుటుంబానికి చెందిన నేను, మీతో లేచి వచ్చేశానని, నన్ను అందరూ తెగ విమర్శిస్తారు, నోటికి వచ్చినట్టు దూషిస్తారు. అనరాని మాటలంటారు. నా లాంటి పతితలు సంఘంలో వుండకూడదని గొంతెత్తి అంటారు. కాని.... కాని.... యేం చెయ్యాను! నేను యే పరిస్థితుల్లో యీ సాహసానికి వొడిగట్టానో తెలుసుకునేందుకుమాత్రం యెవరూ ప్రయత్నించరు."

"పరిస్థితులా?"

సావిత్రి దీర్ఘంగా నిట్టూర్చింది. "మీకా విషయా

లేవీ చెప్పలేదు. అవన్నీ చెబితే, మీరు వెనక్కి జంకుతారే మోనని భయపడ్డాను. మీకూ, నాకూ పరిచయ మవ్వడం కూడా దైవికంగానే జరిగింది. ఎదురుగా వుంటున్నా మనం యెప్పుడూ మాట్లాడుకోలేదు. ఆ రోజు సినిమా హాలు దగ్గర, మా అమ్మ మీతో మాట్లాడినప్పుడు మాత్రం మీతో.... కాదు.... మీ కళ్ళతో పరిచయమయింది. ఆక్షణం నుంచీ నాలో అదో విధమైన నూతన భావాలు రేకెత్తాయి. ఆ రోజు నుంచి మిమ్మల్ని దూరంనుండి చూస్తూ,ఆనందాన్ని అనుభవిస్తు న్నేదాన్ని. కాని,దూరంగా వుండడం నాకు సాధ్యమయింది కాదు. అందుకే మీ ఇంటికి పుస్తకాల నెపంతో రావడం ప్రారంభించాను. క్రమంగా మన పరిచయం పువ్వులు తొడిగింది. మనసులు అల్లుకోవ డం ప్రారంభించాయి. అదే సమయంలో మా నాన్నగారు నా కోసం సంబంధం చూశారు. ఆ సంబంధం ఆయనకి నచ్చింది. ఆ సంబంధం వద్దని బ్రహ్మ వచ్చి చెప్పినా విని పించుకునే స్థితిలో ఆయన లేరు. ఆ వరుణ్ణి నేను చాటుగా చూశాను. నాకు తగినవాడు కాదనిపించింది. ఎందుకో మరి నా మనసు అతనిమీద లగ్నం కాలేదు. అబ్బాయి నా కిష్టపడలేదని ధైర్యంగా నిలబడి చెప్పే శక్తి నాలో లేకపోయింది. చెప్పినా మా నాన్న ఒప్పుకోరని నాకు తెలుసు. ఈ బలహీనతలన్నీ ఒక్కుమ్మడిగా నన్నిలా ప్రోత్సహించాయి. ఇంతకంటె, నాకు వేరే మార్గం గోచ రించలేదు. మిమ్మల్ని రేకెత్తించి ఓ క్లిష్టపరిస్థితిలో అగా

ధంలో తెచ్చి పడేశాను. నన్ను క్షమించండి ...” అంటూ రెండు చేతుల్తో మొహం కప్పుకొని భావురుమంది సావిత్రి.

మంచు ముక్కలా ద్రవించిపోయాడు భానుమూర్తి. అబల కన్నీటికి వుండే విలువ, ప్రతిభ, యిప్పుడతనికి తెలిసొచ్చింది. సావిత్రిపై జాలి, సానుభూతి జనించాయి.

“ఛ, అదేమిటి సావిత్రీ! యీ మాత్రం దానికే యింతగా అధైర్యపడితే యెలా? ధైర్యంగా నిలబడు, ధైర్యం చిక్కబడితే యెంతటి దుర్గమ మార్గంలోనైనా ప్రయాణం సాగించవచ్చు. నీ బాధని నేను అర్థం చేసుకున్నాను. నా కోసం నువ్వేమీ బాధపడకు. మన భవిష్యత్తు, మన యిద్దరి మీదా ఆధారపడి వుంది. నా కోసం నువ్వింత త్యాగం చేసినపుడు, నేను మాత్రం త్యాగం చెయ్యలేనా? ఉద్యోగం కోసం తప్పకుండా ప్రయత్నిస్తాను” అన్నాడు నిబ్బరంగా.

ప్రయత్నించినంత మాత్రాన ఉద్యోగం లభిస్తుందా? లభించినా ఆ పరాయి ప్రదేశంలో యెన్నాళ్ళు వుండగలరు? .... అన్న ప్రశ్నలు వాళ్ళిద్దరిలో యెవరికీస్ఫురించలేదు.

“ఈ నిమిషాలమీద వుద్యోగం దొరుకుతుందన్న నమ్మకం నాకు లేదండీ! అవసరమైతే ప్రస్తుతానికి ఓ జత నా గాజులు అమ్మేయండి” అన్నది సావిత్రి.

“వొద్దు సావిత్రీ, నా దగ్గర యింకా కొద్దిగా డబ్బు వుంది. రెండు మూడు రోజులు గడిపేయొచ్చు. ఉద్యోగం దొరికిందంటే, వాళ్ళ దగ్గరే అడ్వాన్సు తీసుకోవచ్చునుగా! ముక్కూ, మొహం తెలీని యీ వూళ్ళో వస్తువులు తీసుకు

పోయి అమ్మజూపటం, శ్రేయస్కరం కాదేమోననిపిస్తుంది" అన్నాడు మూర్తి.

సావిత్రి క్షణంసేపు ఆలోచించింది. "పోనీ హోటలు మేనేజరు దగ్గరే గాజులుంచి కొంత డబ్బు పుచ్చుకుంటే ? పర్సు పోయిందని బొంకుదాం .. "అంది.

"ఐడియా బాగానే వుంది. కాని, మనం అబద్ధం చెపుతున్నట్లు వాళ్ళకేమాత్రం అనుమానం తట్టినా ప్రమాదమే. మన స్వస్థలాలూ, మన పుట్టు పూర్వోత్తరాలూ, మన బాంధవ్యాలూ, ఒక టేవిటి యెన్నో ప్రశ్నలు గుచ్చిగుచ్చి అడుగుతారు. మనం అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్న భార్యాభర్తలం కామన్న వరకూ విడిచిపెట్టరు. ఎందుకు చెప్పు, కోరి ప్రమాదం తెచ్చిపెట్టుకోవడం ?"

భానుమూర్తి ఆ మాటలనే సరికి, సావిత్రికి భయం పుట్టింది. ఆ ప్రశ్నలన్నీ యెవరో అడుగుతున్నట్లు, తను చెప్పేందుకు తడబడుతున్నట్లు ఫీలయింది, నోట మాట రాలేదు. అయోమయంగా దృక్కులు ప్రసరిస్తూ మౌనంగా వుండిపోయింది.

"నేనలా వెళ్ళి వస్తా సావిత్రీ !" అంటూ లేచాడు భానుమూర్తి.

"కాస్త వేగిరం వచ్చేయండి...."

"ఉద్యోగాన్వేషణలో ప్రదక్షిణ చెయ్యాలిగా ! ఎప్పుడు విసుగుపుడితే అప్పుడే వచ్చేస్తాను. నీకు ఆకలిగా వుంటే భోజనం తెప్పించుకో. మరో మూడు రోజుల వరకు హోటలు వాళ్ళకి మనం డబ్బివ్వ నవసరములేదు. తర్వాత

సంగతి చూద్దాం....” అంటూ బైటకి నడిచాడు భాను మూర్తి.

సావిత్రి తలుపు దగ్గరగా వేసి, నిమీలిత నేత్రయై కర్తవ్యాన్ని ఆలోచిస్తోంది. ఆలోచనలతో ఆమె మొదడు వేడెక్కింది.

తలుపులు కిర్రుమంటే మొహమెత్తి చూసింది. ఎదురుగా హోటలు కుర్రాడు రాజు నిల్చున్నాడు. “మేనే జరుగారు వచ్చారమ్మా” అన్నాడు.

సావిత్రి లేచి నుంచుంది. మేనేజరు రాకకి కారణం యేమిటో, ఆమె వూహించుకోలేకపోయింది. మేనేజరు శంకరరెడ్డి ద్వారం దగ్గరే నుంచుని ఠీవిగా సిగరెట్ పొగ వదుల్తూ “మా హోటల్లో యే విధంగానైనా యిబ్బంది కలుగుతుందాండీ?” అన్నాడు.

“అబ్బె! యిబ్బందేమీ లేదు లెండి” మొహమాం దించుకుంటూనే అంది సావిత్రి.

“నాకు తెలుసు, మా హోటల్లో యిబ్బంది వెదకి చూపించదు – ఇంటిదగ్గరున్నంత సుఖంగానే వుంటుందని అందరూ అంటూ వుంటారు, ఆయన లేరా?” అన్నాడు మంద హాసంతో.

సావిత్రికి యీ ప్రశ్నలు యేమీ రుచించలేదు. కాని తప్పించుకుందుకు మార్గం కనిపించలేదు.

"స్కూల్లోకి వెళ్ళాను," ముక్తసరిగా అంది.

"ఓ! అలాగా, మీరు చాలా దూరప్రాంతంనుండి వచ్చినట్టున్నారు? స్వస్థలం తెలుసుకోవచ్చునా? ఇలా అడుగుతున్నానని మరేమీ అనుకోకండి" అన్నాడు మళ్ళీ శంకరరెడ్డి.

సావిత్రి కలవరపడింది. ఆపాదమస్తకం కంపించి పోతోంది. 'ఈ ప్రశ్నలన్నీ అతను అడగాల్సిన అవసర మేముంది? కొంపదీసి సి. ఐ. డి. కాదుకదా!' అన్న అనుమానం తట్టేసరికి మరింత భయపడింది. కాని, తను అలా సందేహించడం, తొట్రుపడ్డం అనుమానానికి ఆస్కారమవుతుందనుకుని –

"విశాఖపట్నం లెండి," అనేసింది ముక్తసరిగా.

ఆమె తడబడుతూవుందని అర్థం చేసుకున్నాడు శంకరరెడ్డి. ఆమె ధోరణిచూసి, తప్పకుండా ఆమెలో ఏదో బలహీనత వుందని నిర్ధారణ చేసుకున్నాడు. తను యే ఉద్దేశంతో వచ్చాడో అది మాత్రం సఫలం కాకపోవడం అతనికి నిరుత్సాహాన్ని కలిగించిందనే చెప్పాలి. కనీసం ఆమె నిక్కెత్తయినా చూడ్డంలేదు. క్రమంగా దారికి తీసుకరావచ్చుననుకుని "మీకేమైనా యిబ్బంది కలిగితే నాకు చెప్పండి. వస్తా" అంటూ వెనక్కు తిరిగాడు. రాజు అతణ్ణి అనుసరించాడు.

పార్వతి తడబడే అడుగులు వేసుకుంటూ వెళ్ళి తలుపు చేరవేసింది. మరో కొత్త సమస్య యెదురైనట్లయిందామెకి. మేనేజరు వచ్చి అన్ని ప్రశ్నలువేసి వెళ్ళడంలో గల అంతరార్థం యేమిటో ఆమెకు అవగాహన కాలేదు. ఏమైనా ఆమెలో కొత్తభయం ప్రవేశించింది.

శంకరరెడ్డి ఆఫీసుగదిలో కూర్చుని కాలుస్తున్న సిగరెట్ ఆష్ట్రేలో వేస్తూ; "లేచి వచ్చిన మనిషిలానే కన్పిస్తున్నదిరా రాజూ" అన్నాడు.

రాజు పళ్ళికిలించాడు. శంకరరెడ్డికి వాడు నౌకరయినా యెంతో స్నేహమున్న వ్యక్తిలానే సహకరించడం వల్లనేనేమో, యజమానికి స్నేహితుడయ్యాడు. వారిద్దరి మధ్య అంతస్థుల్లేవు. "నేను మొదటే చెప్పానుగదండీ. ఇందులో అనుమానం యేమీ లేదు. లేచివచ్చిన మనిషే. భార్యాభర్తలయితే యీ హోటల్లో యెందుకుంటారండీ! ఉన్నా రెండు మూడు రోజులుంటారుగాని యిన్నాళ్ళా? ఇదేం 'ఫ్రూటీనూ, లేక సినిమానా?' అన్నాడు రాజు.

"ఔనౌను! అదే నా అభిప్రాయమూను. పిట్ట యెలాంటిదో కాస్త ఆరా తియ్యాలి." అన్నాడు రెడ్డి వుత్సాహంగా. "నేనది చూసుకుంటాన్లెండి" అంటూ వెళ్ళి పోయాడు రాజు.

శంకరరెడ్డి గోల్డుగోల్డు సిగరెట్ కేస్‌నుంచి ఓ సిగరెట్ తీసి ముట్టించాడు,

* * *

భానుమూర్తి వచ్చి తలుపు నెట్టేసరికి సావిత్రి త్రుళ్ళిపడి లేచింది. మూర్తిని చూడ్డగానే ఆమె గుండెలు తాపీ పడ్డాయి.

"ఏమయ్యిందండీ?" అంది ఆసక్తితో.

"అంత తేలిగ్గా ఉద్యోగాలు దొరికే రోజులా యివి సావిత్రీ? ఓ పత్రికాయన రేపు రమ్మని చెప్పాడు."

"ఏదో కాస్తంత ఆశ చూపించాడన్న మాట."

"ఆ! యిదంతా వ్యాపార లక్షణంలే. రేపు వెళ్లాక ఖాళీలు లేవని చెప్పనూవచ్చు. ఉద్యోగం దొరికేవరకూ దొరికిందని అనుకోలేం" అన్నాడు భానుమూర్తి.

"దొరుకుతుందన్న ఆశతో యెందుకుండ కూడ దండీ!"

"పోనీ అలాగే అనుకుందాం. ఆఁ....నువ్వు భోజనం చేశావా!" నవ్వుతూ అన్నాడు భానుమూర్తి.

"లేదండీ, మీరు వచ్చాక భోంచేయొచ్చని వూరుకున్నా."

"పదయితే" లేచాడు.

"ఒక్క మాటండీ!" అంది సావిత్రి.

"ఏమిటి?"

"మనం యిక్కడించి వీలైనంత త్వరలో బైటపడ్డం మంచిదేమోనండీ" మెల్లగా అంది.

మళ్ళీ యేం ఉపద్రవం ముంచుకొచ్చిందోనని గతుక్కుమన్నాడు భానుమూర్తి.

"ఏం? ఏమయిందేమిటి?" ఆతృతగా అన్నాడు.

సావిత్రి అంతా పూసగుచ్చినట్లు చెప్పింది. భానుమూర్తి ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. గట్టిగా ఓ నిట్టూర్పు విడిచాడు.

"ఊ! సరే! రేపు ఉద్యోగ విషయం యేదో తేలిపోతుందిగా! ఆ తర్వాత ఒక నిర్ణయానికి వద్దాం. భోజనానికి పద" అంటూ బైటికి నడిచాడు. సావిత్రి అతణ్ణి అనుసరించింది.

## 4

అనుకున్న విధంగా నరహరి విశాఖపట్నం వెళ్లాడు. సావిత్రిగారింటి ఆవరణలో అడుగు పెట్టాడు. అయిష్టంగానే అప్పటికి సావిత్రి తండ్రి సీతారామయ్య నరహరిని యింతకు ముందు యెరిగివున్నవాడు గాబట్టి లేచి నుంచున్నాడు.

"నమస్కారమండీ!" అన్నాడు నరహరి.

"నమస్కారం .. రండి కూర్చోండి" అన్నాడు సీతారామయ్య కాస్త కటువుగానే.

అతని ధోరణి నరహరిని నిరుత్సాహపర్చింది. అయినా కుర్చీలో కూచున్నాడు.

సీతారామయ్య నరహరికి యెదురుగావున్న కుర్చీలో కూలబడుతూ; "మీ బావమరది యెలాంటి నీచపుపని చేశాడో చూశారా! మా వంశ గౌరవం మంటగలిపాడు. నేను నలు

గురిలో మొహమెత్తుకు తిరగలేకపోతున్నాను ..." వృద్ధ కంఠంతో అన్నాడు.

తను వచ్చిన వెంటనే యిలాంటి ప్రస్తావన రావడం నరహరికి నచ్చలేదు. అయితే సీతారామయ్యలో రగులుతున్న బడబాగ్నిని చల్లార్చటం తనకి సాధ్యం కాదనుకున్నాడు. పూర్తిగా భానుమూర్తినే యీ విషయంలో బాధ్యునిగా చేయడం అన్యాయమనిపించింది. ఆ అమ్మాయి కూడా కొంతవరకు బాధ్యురాలే! స్త్రీగా చూపవల్సిన సహనం, సభ్యత ఆమె చూపలేదు.

"ఉద్రేక పడకండి సీతారామయ్యగారూ! పూర్తిగా నూవాణ్ణే మీరు నిందించడం భావ్యంగాలేదు. వాణ్ణి నేను సమర్థిస్తున్నానని మీరు మరో విధంగా అనుకోకండి. ఏదేమైనా యిప్పుడవన్నీ నెమరువేసుకుని తర్జన భర్జన పడ్డం గతజల సేతుబంధనం లాంటిది. జరిగినదానికి విచారించే కంటే, జరగవల్సిన దానికోసం యోచించడం బుద్ధిమంతుల లక్షణం. ప్రస్తుతం వాళ్ళ వునికి మీకేమన్నా తెలిసిందా!" అన్నాడు నరహరి.

సీతారామయ్య కళ్ళు అప్రయత్నంగా ఎర్రబడ్డాయి. కనుబొమలు ముడిపడ్డాయి. "వాళ్ళ వునికి తెలుసుకునే అవసరం మాకేమీ లేదండీ! మా అమ్మాయి చచ్చిపోయిందని యేనాడో నిశ్చయించుకున్నాము. ఇక అదెక్కడుంటే మాకేం? మా కుటుంబగౌరవం మంటగలిపిన మనిషి వుంటేనేం చస్తేనేం" ఉద్రేకంతో అన్నాడు సీతారామయ్య.

"మీ అమ్మాయి ఉత్తరం రాసి వుంటుందేమోనని అడిగానండీ! అంతే" మెల్లగా నసిగేశాడు నరహరి.

"లేదు....ఒకవేళ రాసినా ఆ వుత్తరాన్ని ముక్క-ముక్కలుగా చించేసి కాల్చేయనూ! దాన్ని మళ్ళీ నా గడపతొక్కనిస్తామటండీ! ఛీ! నాకడుపున చెడబుట్టింది...." గర్జించినట్టే అన్నాడు సీతారామయ్య.

ఇంక లాభం లేదనుకున్నాడు నరహరి. అనవసరంగా వాగ్వివాదాలు పెంచుకోవాల్సి వస్తుందేమోనని భయపడి "వస్తానండీ" అంటూ లేచాడు.

అంతవరకూ యీ సంభాషణంతా లోపల్నుంచి వింటూన్న సావిత్రి తల్లి తులశమ్మ తలుపు చాటుగా వుండి- "మీ కేమైనా ఉత్తరం వచ్చిందా బాబూ!" అంది.

నరహరి జవాబివ్వక ముందే సీతారామయ్య అందుకున్నాడు. "వస్తేనీకేం! రాకపోతే నీకేం! ఆ విషయమే ఎత్త వద్దని నీ కెన్నిసార్లు చెప్పాను?" కసురుకున్నాడు.

ఆడదైనా తులశమ్మకీ అభిమానమన్నది ఒకటుందిగా!

"మీకు ఆ విషయాలు తెలుసుకోవాలని లేకపోతే మీరు వూరుకోండి. మీది పాషాణహృదయం గాబట్టి పట్టించుకోకుండా ధైర్యంగా వుండగలుగుతున్నారు. కన్న తల్లిని నాకు మనసెలా ఒప్పుతుంది చెప్పండి!" చీదరించుకున్నట్టుగా అంది. సీతారామయ్య యేమనుకున్నాడో యేమో మరేమీ మాట్లాడలేదు.

"లేదమ్మా! మాకూ యేం వుత్తరం రాలేదు. అందుకే మీకేమైనా వుత్తరం వచ్చి వుంటుందేమోనని తెలుసుకుని రమ్మంది మా అత్తయ్య" అంటూ సీతారామయ్య వైపు తిరిగి "పోలీసు రిపోర్టుగాని యిచ్చారా యేమిటి?" అన్నాడు నరహరి.

సీతారామయ్య కళ్ళు నిప్పుల్లా మెరిశాయి. "ఇంక అదొకటటండీ! ఇప్పటికి మంటగల్సిన పరువు ప్రతిష్టలు చాలవూ!" క్రోధావేశంతో అన్నాడు.

"వస్తానండీ మరి" అంటూ బైటికి నడిచాడు నరహరి.

సీతారామయ్య కెరటంలా లేచి యెదురుగా వచ్చిన భార్యవేపు గుడ్లురిమి చూశాడు.

"దాని విషయం నిన్నెవరడగమన్నారు?" గర్జించాడు.

"ఒకరు నన్ను అడగమని చెప్పే దేమిటండీ! ఎంత చెడ్డా అది నా కూతురు" ధైర్యంగా అంది తులశమ్మ.

"నాకూ కూతురే! అయితే యేం? నా గౌరవం మంటగలిపింది. నలుగురిలో నన్ను మొహమెత్తుకు తిరక్కుండా చేసింది. నేను పెళ్ళికొడుకువాళ్ళ కిచ్చిన మాట పొల్లయింది. నా వెనక నలుగురూ యెన్ని అనుకుంటున్నారో యెవరికి తెలుసు?" పుద్రేకంతో అన్నాడు.

"అవన్నీ మనం లెఖ్ఖచేస్తే అవుతుందండీ? పాలి తెలియని జ్ఞానంతో అమ్మాయి తప్పుచేసిందే అనుకోండి. ఆ తప్పును తల్లిదండ్రులే క్షమించకపోతే యింకెవరు క్షమిస్తారు చెప్పండి? వాళ్ళిద్దరికీ వివాహంచేసేస్తే తీరిపోతుందిగా! ఆ అబ్బాయికూడా మనకులంవాడేనాయె" అంది తులశమ్మ.

సీతారామయ్య తోకతొక్కిన త్రాచులా 'బుస్' మన్నాడు.

"నోర్ముయ్. ఇప్పుడన్నావుగాని, యింకెప్పుడూ ఆ మాట అనకు. నేనైతే దాన్ని నా యింట్లో అడుగు పెట్ట నివ్వను" ఉద్రేకంతో అనేసి రివ్వున పెరట్లోకి పోయాడు.

తులశమ్మ గుడ్ల నీరు నింపుకుని లోపలికి పోయింది.

* * *

సీతారామయ్య యింటినుండి వెళ్ళిన నరహరి, అత్త వారి యింటి ప్రక్కనే వున్న రామానుజం గారింటికి వెళ్ళాడు. రామానుజం అప్పటికి వార్తాపత్రిక చదువు తున్నాడు. నరహరిని చూసి "రండి .. రండి .. ఏంపటిలా వచ్చారు" అంటూ ఆహ్వానించి ఆసనం చూపించాడు.

నరహరి కూచున్నాడు.

"మీ బావమరిది జాడ యేమన్నా తెలిసిందా!" అన్నాడు మళ్ళీ రామానుజం.

"ఏమీ తెలీలేదండీ!" అన్నాడు అయిష్టంగా.

"మీవాడు చేసినపని యేమీ బావులేదండీ నరహరి

గారూ! అతడు యీ విధంగా తయారవుతాడని యెప్పుడూ అనుకోలేదు. మీ మావగారు బ్రతికున్న రోజుల్లో ఆ కుటుంబం యెంత మర్యాదగా, యెంత గౌరవంగా బ్రతికింది. అలాంటి తండ్రికీ, కుటుంబానికీ కళంకం తెచ్చిపెట్టాడీ అబ్బాయి" చిన్న ఉపన్యాసమిచ్చాడు రామానుజం.

నరహరికి చెళ్ళున లెంపకాయ కొట్టినా అంత కష్టమనిపించేది కాదు. కాని, తన మొహాన బావరిదిమని అలా విమర్శించడం బాధనిపించింది, కాని, యేమంటాడు? భానుమూర్తి ఆ విమర్శకు అర్హుడే అనుకున్నాడు.

"మేం అనుభవిస్తున్న వ్యధా అదేనండీ! ఏం చేస్తాం చెప్పండి!"

"జరిగిపోయినదానికి బాధపడి ప్రయోజన మేముంది లెండి.... మొక్కగా వున్నపుడే వంచాల్సింది...."

నరహరి ప్రస్తావన మార్చేయాలనుకున్నాడు. "అత్తగారు మీ దగ్గరికి పంపారండి."

"నాదగ్గరికా! ఎందుకూ!"

"మరేం లేదు. వాళ్ళ యిల్లు యెవరికైనా అద్దెకు యిచ్చేయమని చెప్పమన్నారు. తాళాలు నాచేత పంపారు.

"అరెరె! మొన్ననే ఒకతను యిల్లు కావాలన్నాడు సుమండీ! మీ అత్తగారు, కొడుకు చేసిన నిర్వాకానికి కుమిలిపోయి, యెవరికీ మొహం చూపించలేక, అకస్మా ... వెళ్ళేముందు నాకు చెప్పే స్తే యీ

సరికి యింట్లో మెవరో ఒహరు దిగివుందురు" నొచ్చుకుంటూ అన్నాడు రామానుజం.

"ఇప్పుడైనా మించిపోయిందేమిటి లెండి? ఇంకెవరికైనా అవసరముంటుందేమో చూడండి. ఈ ఊళ్ళో వసతి అవసరంలేనివాళ్ళు యెవరున్నారు?"

"అది నిజమే అనుకోండి ... ఆఁ....అద్దె యెంత చెప్తున్నారు?"

"ఇల్లు పెద్దది. కుటుంబం కాస్త పెద్దదయినా, ప్రశాంతంగావుండవచ్చు. నలభైరూపాయలు చెప్పండి ..."

"సరే! అలాగే."

"తాళాలు వుంచండి...." అంటూ సంచిలోంచి తీసి యిచ్చాడు నరహరి.

"మరిక, నే వస్తానండీ!" అంటూ లేచాడు నరహరి.

"కాస్త. కాఫీ తీసుకుని వెళ్ళండి" అన్నాడు రామానుజం.

"వొద్దండీ, పాసింజరుకి వేళవుతోంది" అంటూ వెనక్కి తిరిగాడు.

"మంచిదయితే. మీ అత్తగార్ని అడిగానని చెప్పండి. ఎవరైనా అద్దెకు దిగిన వెంటనే మీకు తెలియబరుస్తా" అన్నాడు రామానుజం, నరహరిని ద్వారంవరకూ సాగనంపుతూ.

రామానుజం తిరిగివచ్చి కుర్చీలో కూచున్నాడు. లోపట్నుంచి రాజరత్నం వచ్చింది.

"వచ్చినాయన యశోదమ్మ అల్లుడు కదుటండీ!" అంది.

"ఔను...."

"ఎందుకొచ్చాడేమిటి? భానుమూర్తి యెక్కడున్నదీ తెలిసిందా!"

"అదే తెలుసుకునేందుకు వచ్చాడేమో, మనతో చెప్పలేదు. ఇల్లు యెవరికైనా అద్దెకిమ్మని చెప్పి తాళాలు పంపిందావిడ."

"పాపం యశోదమ్మ చాలా మంచిమనిషి సుమండీ! మన మంటే, ఆమె కెంతో నమ్మకం ..."

"అలాంటి మనిషి కొడుకు చూడు, యెలా తయారయ్యాడో! తులసివనంలో గంజాయి మొక్కలా పుట్టాడు. ఏమిటో యీ వేళా రేపూ యెవర్నీ నమ్మలేకపోతున్నాం. ఆ సీతారామయ్య కూతురు, సావిత్రి యెంతో మంచిపిల్ల అనుకునేవాళ్ళం. అదిమాడు యెలా లేచిపోయిందో! ఆ వెధవకి బుద్ధిలేకపోతే, దానికైనా బుద్ధి వుండక్కర్లేదూ!" చీదరించుకుంటూ అన్నాడు రామానుజం.

"పోనిద్దురూ! మనకెందుకవన్నీను" అంటూ వంటగదివేపు పోయింది రాజరత్నం.

రామానుజం వార్తాపత్రిక తీసి మళ్ళీ చదువులో నిమగ్నుడయ్యాడు.

# 5

నరహరి యిల్లు చేరుకునేసరికి తమ్ముడు దయానిధి, మరదలు సీత, వాళ్ళ పిల్లలూ, వచ్చివున్నారింట్లో. వాళ్ళని చూస్తూనే వరుస పేరిట పలుకరించాడు.

"ఉత్తరం ముక్కయినా రాయకుండా, అకస్మాత్తుగా వచ్చారేవిట్రా దయానిధీ?" అన్నాడు నరహరి కుర్చీలో కూలబడుతూ.

దయానిధి జవాబు చెప్పడానికుపక్రమించేటంతలో సీత చప్పున అందుకుంది. "రామమూర్తి పరారీ అయ్యాడని మీరు ఉత్తరం రాశారుకదా బావగారూ! ఆ ఉత్తరం చూశాక, నిజంగా మా మనసులు 'పాడయ్యాయంటే నమ్మండి. ఎలాగూ వస్తున్నాంకదా అని ఉత్తరం రాయలేదు. ఎప్పుడు మిమ్మల్నందర్నీ కలుసుకుంటామా అన్న తహతహతోనే వచ్చేశాం" అంది సీత.

మాటకారితనానికి పెట్టిందిపేరు సీత. ఆమె మాటలు ప్రారంభించిందంటే యెదుటి వాళ్ళు విసిగిపోయి యేదో లేనిపని కల్పించుకుని అక్కణ్ణించి వెళ్ళిపోతేనేగాని, ఆమె వాగ్ధాటి ఆగదు.

నరహరికి మరదలు మనస్తత్వం బాగా తెలుసు. ఆమె చెప్పిందాంట్లో యెంత వాస్తవం ఉన్నదీ అన్న

విషయం గురించి అతను ఆలోచించలేదు. ఎందుకూ అంటే, అందులో వాస్తవికత లేదుగాబట్టి. ఏదో అవసరం లేకుండా వాళ్ళు అంత అకస్మాత్తుగా రారని లోలోన నిర్ధారణ చేసుకున్నాడు.

"భానుమూర్తి జాడ యేమన్నా తెలిసిందా అన్నయ్యా!" అన్నాడు దయానిధి.

"లేదురా! ఆ అమ్మాయి తల్లిదండ్రులకేమైనా తెలిసిందేమో కనుక్కొందుకే వాళ్ళింటికి వెళ్లాను. కాని, వాళ్ళకీ తెలియదట" అన్నాడు నరహరి.

సీత మౌనంగా వుండలేకపోయింది. "ఆఁ! యెలా తెలుస్తుంది? లేచిపోయినవాళ్ళు వాళ్ళ వునికిని తెలియ జేస్తారా! వాళ్ళదగ్గరున్న డబ్బూ, నగలూ హరించకు పోయాక 'దేహీ' అని మళ్ళీ ఇక్కడికే వస్తారు. వాళ్ళకి పౌరుషం యేముంటుంది? అసలు పౌరుషం, అభిమానం, వున్నవాళ్ళయితే యిలాంటి పనే చెయ్యరు. భానుమూర్తి యిట్లా తయారవుతాడని కలలోకూడా అనుకోలేదు. మన కుటుంబాల్లో యెక్కడా యిలాంటి అప్రతిష్ఠ లేదు" అంది అభినయం చేస్తూ.

యశోదమ్మ, కమల ఆ మాటలు విని లోలోన కుమిలిపోయారు. భార్య ధోరణికి దయానిధికి కోపం వచ్చింది.

"అవన్నీ వల్లించమని నీ కెవరు చెప్పారు సీతా! వచ్చినదానివి నోరు మూసుకు వుండలేవూ! ప్రతి విషయం లోనూ తగుదునమ్మా అని కలిగించుకుంటావు" అన్నాడు

వుద్రేకంగా. అంత గట్టిగా భార్యని యెలా మందలించగలి గానా అని అతనే తర్వాత ఆశ్చర్యపడ్డాడు.

సీత మొహం జేవురించింది. కళ్ళు నిప్పులు చెరుగు తున్నాయి. అయినాసరే నోటికి తాళంవేసి చరచరా లోప లికిపోయింది.

"పోనీ లేరా దయానిధీ! అవిడ మన తత్వమే అంత" సర్దేశాడు నరహరి. "మొహం కడుక్కుని వస్తానుండు. చిరాగ్గావుంది" అంటూ పెరట్లోకి నడిచాడు.

ఆ రోజు రాత్రి దయానిధీ, నరహరీ భోంచేస్తున్నారు. కమల వడ్డిస్తోంది. సీత కాస్త దూరంలో కూచుంది. యశో దమ్మ, సరస్వతి గదిలోపల మాట్లాడుకుంటున్నారు.

"సరస్వతి పెళ్ళి విషయం యేంచేశావు బావా!" అంది సీత.

"ఏంచేస్తాం! రెండు మూడు సంబంధాలు వచ్చాయి గాని, నాకు యిష్టం లేకుండావుంది. కట్నం కాస్త అధి కంగా యిచ్చయినాసరే, మంచి ఉద్యోగస్తుడి కివ్వాలని వుంది" అన్నాడు నరహరి.

సీత భర్తవేపు చూసి 'చెప్పండి' అన్నట్టుగా సౌంజ్ఞ చేసింది. ఆ ప్రసక్తి అంత త్వరలో తీసుకురావడం దయానిధికి యిష్టంలేకపోయింది. కాని, యేం చేస్తాడు? వూరుకుంటే భార్యతో పడలేడాయె!

"సీతతో ఓ విషయం మాట్లాడాలనుం దన్నయ్యా" అన్నాడు మెల్లగా దయానిధి.

"ఏవిట్రా!"

"ఇన్నాళ్ళూ భానుమూర్తికి సరస్వతి నిస్తావేమోనని యీ ప్రసక్తి తీసుకురాకుండా వూరుకున్నాం. అతను మూర్తే యిప్పుడిలా పలాయనం చిత్తగించాడు. అతడి వునికే తెలీటం లేదు. ఒకవేళ తెలిసినా అమాయకురాలైన యిక్కడ పచ్చలాంటి సరస్వతిని కట్టబెడతావని నేననుకోను..." అని ఆపేశాడు.

మరుపు మాటలు కమలను ములుకుల్లా బాధించాయి. ఇక సీత విషయం చెప్పుకోవాలంటే, భర్త చాలా నేర్పుగా మాట్లాడుతున్నందుకు లోలోన వుప్పొంగిపోయింది.

"అయితే యేమంటావిప్పుడు? నువ్వేదయినా సంబంధం చూశొచ్చావా యేమిటి? అన్నాడు నరహరి ఆసక్తిగా. "పరాయి సంబంధం యేమీ కాదు. మా బావమరిది జగన్నాథం వున్నాడు కదూ! ఇద్దరికీ యీడూ జోడూ బావుంటుంది. ఉద్యోగమంటావా! రేపో మాపో రెవిన్యూ యినస్పెక్టరు హోదాలోకి వెళ్ళబోతున్నాడు. ప్రస్తుతం మా యింట్లోనే వుంటున్నాడని తెలుసును కదూ!" అన్నాడు దయానిధి

భానుమూర్తి పరారీ అయ్యాడని తెలిసి పరామర్శించడానికి వచ్చామని చెప్పిన తమ్ముడు, మరదళ్ళ అంతర్యాన్ని యిట్టేపసిగట్టేశాడు నరహరి. చప్పున జవాబివ్వలేకపోయాడు. జగన్నాథంపై అతనికి ఒక విధంగా సదభిప్రాయం వున్నా, రూపురేఖల్లో సరస్వతికి తగినవాడు కాదనే విషయంలో వెనకంజ వేస్తోంది అతని మనస్సు.

నరహరి యేం చెప్తాడోనని దయానిధి, సీత ల గుండెలు గడియారంలా కొట్టుకుంటున్నాయి. కమలకి వాళ్ళ మాటలు రవ్వంతయినా రుచించలేదు. 'తన తమ్ముడికి దక్కని తన స్వంత కూతురు, తన తోడికోడలి తమ్ముడికి మాత్రం యెందుకు భార్య కావాలి?' అన్న స్త్రీ సహజమైన అసూయ ఆమెలో మొలకెత్తింది. భర్త యేం చెప్తారోనని ఆమెకూడా ఆసక్తిగా, ఆతృతగా చూస్తోంది.

అన్నగారి మౌనాన్ని సహించలేకపోయాడు దయానిధి.

"ఏమిటన్నయ్యా ఆలోచిస్తున్నావు? ఎవరో పరాయి వాళ్ళకి కట్టబెడితేమాత్రం ప్రయోజన మేముంది? ఎంతైనా దగ్గరివాళ్ళు దగ్గరివాళ్ళే! జగన్నాథంకూడా మన పరిస్థితంటే చాలా మక్కువతో వున్నాడు. వాళ్ళకీ మనకీ మరింత సన్నిహితం యేర్పడుతుంది.... అదే నా ఆశ."

"ఔను బావా! మా నాన్నగారుకూడా మీతో యిదేమాట చెప్పమన్నారు." అంది సీత.

మగవారి మాటల్లో తను కలిగించుకోకూడదని యింతవరకూ తటపటాయిస్తున్న కమలకి అవకాశం దొరికింది. భర్త యేమీ మాటివ్వకముందే తను అడ్డుపుల్ల వేయాలనుకుంది.

"సరస్వతి పెళ్ళికి యిప్పుడేం తొందరొచ్చిందనె

సీతా! ఇంకా దాన్ని చదివించాలనుకుంటున్నాం." అంది కమల.

భార్య మాటల్లోని అంతరార్థం యేమిటో నరహరి గ్రహించలేకపోయినా, జగన్నాథంకి సరస్వతి వివాహంలో కమల సుముఖురాలు కాదన్న విషయం నిర్ధారణ చేసుకున్నాడు.

"అమ్మాయికి చదువుకోవాలన్న ఆసక్తి వుందో లేదో ముందు తెలుసుకుందాంరా. తర్వాత దాని పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించవచ్చు...." ఎటూ తేల్చకండా అన్నాడు నరహరి.

"ఇప్పుడే పిల్చి అడిగేద్దాం...." అంది సీత.

కమలకి తోడికోడలిమీద కోపం వచ్చింది. కాని ప్రస్తుతం ఆమె తమ యింట్లో బంధువు. అందుకే కాస్త తగ్గింది.

"అప్పుడే యెందుకు సీతా! అన్నీ నిముషాలమీద జరగాలంటే యెట్లా? తర్వాత అడగవచ్చునులే...." అంది కమల.

కమల వుద్దేశం యేమిటో సీతకి బోధపడలేదు.

"పోనీ అక్కా! మా తమ్ముడికి మీ అమ్మాయి నివ్వడం నీ కిష్టమేకదా!" అంది సీత.

కమల గతుక్కుమంది. తన మనస్సులోమాట యెలా పసిగట్టిందో అర్థంకాక, సీత మాటకారితనానికి అచ్చెరువు పొందింది. ఇష్టంలేదని కుండబద్దలుకొట్టినట్లు యెలా

చెప్పడం? చెప్పినా, కారణమేం చెప్తుంది? సందిగ్ధంలో పడింది కమల.

"నా యిష్టా యిష్టాలతో ప్రమేయమేముంది సీతా! నీకు తెలీంది కనుకనా! నువ్వంటే నీ యింట్లో నీ మాటకి విలువ వుంచుకుంటున్నావుగాని, నేనాపాటి అదృష్టానికి నోచుకోలేదు" వొంకతిరుగుతుగా తొడికోడలుమీద దెబ్బ కొడుతూ తనకీ విషయంలో యేమీ ప్రమేయం లేదన్నట్టుగా చెప్పింది.

"ఔనౌను. నువ్వు చాలా దురదృష్టవంతురాలివి...." ముసిముసి నవ్వులు వొలకబోస్తూ అనేశాడు నరహరి.

కమల అన్నమాటలకు సీత లోలోన గర్వపడినా దయానిధి మాత్రం కుంచించుకుపోయాడు. తను భార్య చేతిలో కీలుబొమ్మని. వదిన తనని పరోక్షంగా మొగతాళి చేస్తున్నట్టు ఫీలై బాధపడ్డాడు. 'లేదామన్నయ్యా!' అంటూ భోజనం ముగించి లేచాడు దయానిధి. నరహరికూడా లేచాడు, ఇద్దరూ చేతులు కడుక్కుందుకు వెళ్ళి వచ్చారు.

"సరస్వతీ! తువ్వాలు తెచ్చిపెట్టమ్మా!" అంటూ కేకలు వేసింది కమల.

సరస్వతి లోపల్నుంచి తువ్వాలు తీసుకొచ్చి చిన్నాన్నకి మొదట అందించింది.

"ఇంతవరకూ ఎక్కడున్నావే?" అన్నాడు దయానిధి.

"మామ్మ కథ చెప్తుంటేనూ వింటున్నా చిన్నాన్నా" అంది సరస్వతి.

"ఓహో! అలాగా! ఇక్కడ మేం నీ కథ మాట్లాడుకున్నాంలే" నవ్వుతూ అనేసి, తువ్వాల్ని అన్నయ్యకి అందించాడు దయానిధి. సరస్వతి సిగ్గుతో మొహం దించుకుని మామ్మదగ్గరికి పరుగుతీసింది. నరహరి, దయానిధి వరండాలోకి వచ్చేశారు.

కమల విస్తర్లు తీస్తోంది.... "మా తమ్ముడు పోస్టాఫీసులో నెలనెలా కొంతడబ్బు దాస్తున్నాడక్కా. వాడి బుద్ధి యెవరికొస్తుంది? డబ్బు చాలా జాగ్రత్తగా ఖర్చుబెడతాడు. ఆ పొదుపు అందరికీ అబ్బదు" తమ్ముణ్ణి ఆకాశానికెత్తేస్తూ చెప్పింది సీత.

కమల అవన్నీ వింటూనే పెరట్లోకి వెళ్ళి విస్తళ్ళు పారేసి, చేతులు కడుక్కుంటూవచ్చి వడ్డనకి ఉపక్రమించింది. సీతచెప్పినవాటిని విన్నదేగాని ప్రతిగా ఒక్కటీ అనలేదు.

ఆడవాళ్ళంతా ఒక్కసారే భోజనాలకు కూర్చున్నారు. సరస్వతి వాళ్ళ అమ్మమ్మ ప్రక్కనే కూచుని భోంచేస్తోంది.

"సరూ! పరీక్ష యెలా రాశావే?" అంది సీత.

"బాగానే రాశాను పిన్నీ."

"ప్యాసవుతావా?" మళ్ళీ అంది త.

"అనే అనుకుంటున్నాను" నవ్వుతూ జవాబిచ్చింది సరస్వతి.

"తర్వాత యేంచేస్తావు! యింకా చదువుతావా!" అంది.

కమలకి నిజంగా సీతమీద రెట్టింపు కోపం వచ్చింది. ఆమె నిశ్చయించుకొన్నది అడక్కుండా విడిచిపెట్టలేదు. కాని, తనేం చెప్తుంది?

"చదవాలనే ఉంది పిన్నీ! ఇంట్లో కూచుని మాత్రం యేం చేస్తాను? మరి నాన్నగారేమంటారో !" అనేసింది సరస్వతి.

కమల తృప్తిగా నవ్వుకుంది. తన మనసులో వున్న మాటనే చెప్పిందని సంతసించింది.

"నేను చెప్పానుకదూ సీతా?" అంది కమల. మళ్ళీ నువ్వెందుకడగబోయావన్న వ్యంగార్థంతో.

"అయినా ఆడవాళ్ళకి అంతలేసి చదువులెందుకు? ఎప్పటికైనా ఆ వంటగదిని ఉద్ధరించడానికేగదూ!" వుడుకు మోత్తనంగా అంది సీత.

సరస్వతి చిన్నగా నవ్వింది. "చదువుకుంటే ప్రపంచ జ్ఞానం అలవడుతుంది.... స్త్రీ వంటగదికే పరిమితమైనా, చదువుకున్నందువల్ల కుటుంబాన్ని సక్రమంగా సాగించడానికి తగిన బలం చేకూరుతుంది." సంసారాన్ని స్వర్గమయం చేసుకొంటుంది. అంది సరస్వతి.

సరస్వతి ఆ లేత వయస్సులో అంతలేసి మాటలు చెప్పడం సీతకి నిజంగా ఆశ్చర్యాన్నే కలిగించింది. "ఆ!

చూస్తున్నాంగా! చదువుకున్నవాళ్ళు ఒకో్క యింట్లో అడుగుపెట్టి సంసారాన్ని సర్వనాశనం చెయ్యడం యెన్ని చూడ్డంలేదు?" మళ్ళీ అంది సీత. తన వాదాన్ని దృఢ పర్చాలన్న వుద్దేశంతో.

"అక్కడే పొరబడుతున్నావు పిన్నీ! ఏ కొద్దిమంది విషయమో దృష్టిలో వుంచుకుని అలా మాట్లాడ్డం భావ్యం కాదు. నా వుద్దేశం స్త్రీ చదువుకుంటేనే మంచిదనిపిస్తోంది" అంది.

కూతురు అంత చక్కగా మాట్లాడ్డం కమలకి ఆశ్చర్యం, ఆనందం కలిగింది. కూతురు తను వూహించినంత అమాయకురాలేమీ కాదని నిర్ణయించుకుంది. సీతకూడా ఆ అభిప్రాయమే ఏర్పర్చుకుంది. సరస్వతితో వాదించడం మంచిదికాదనుకుందేమో మరి విసుక్కుంది.

"బాగా మాటలు నేర్చావు సరూ! ఎవర్ని కట్టుకుంటావోగాని, యేడ్పించి వదుల్తావు" కృత్రిమంగా నవ్వుతూ అంది సీత.

సరస్వతిలో అంతవరకూ లేని సిగ్గుదొంతరలు అలముకున్నాయి.

"పో పిన్నీ" అనేస్తూ చేయి కడుక్కుందుకు లేచింది సరస్వతి.

మనుమరాలు మాటల్లో ముత్యాలు వెదజల్లుతూ వుంటే, మౌనంగా వింటోంది యశోదమ్మ. వింటున్నకొద్దీ

ఆమెకి మనసులో బాధ రగుల్తూంది. కళ్ళలో అప్రయత్నంగా నీరు గూడు కట్టింది.... అయినా తమాయించుకుంది. మరి కాసేపటికి అంతా లేచారు.

* * *

రెండు రోజులుండి దయానిధీ, సీతా, వాళ్ళ పిల్లలూ వెళ్ళిపోయారు.

"మీ తమ్ముడూ, మరదలూ రావడానికి ముఖ్యమైన కారణం యేమిటో గ్రహించారాండీ!" అంది కమల వాళ్ళు వెళ్ళిపోయిననాటి సాయంత్రం.

నరహరి భార్య ముఖంలోకి చూశాడు అదోలా.

"ఔను. అర్థమయింది. మరి నీ అభిప్రాయమేమిటి?" అన్నాడు యింటికప్పుకేసి చూస్తూ.

భర్త అలా అడగడంలో ఆయనగారి ఆంతర్యం యేమిటో బోధపడ లేదు కమలకి. అయినా తనుమాత్రం మెత్తపడకూడదనుకుంది.

"నా కంఠంలో ప్రాణముండగా యీ పెళ్ళికి నేను ఒప్పుకోను...." అంది ఉద్రేకంతో.

నరహరి చిన్నగా నవ్వాడు.

"అంత ఉద్రేకం యెందుకు కమలా? నీ అయిష్టానికి కారణం యేమిటో?"

"మీ దృష్టిలో మా తమ్ముడు అర్హుడుగా అగు

పించలేదు. కాని, యీ జగన్నాథం అన్ని విధాలా తగిన వాడుగా కనిపిస్తున్నాడా?" అంత కోపం కమలకి యేనాడూ రాలేదు.

"ఎందుకలా కోపగించుకుంటావు? కాస్త సహనం వహించు. ఇప్పుడేం అమ్మాయి నిస్తామని మాటిచ్చేయ లేదుగా! మనలో మనం తర్కించుకుంటే తప్పేవిఁటి?"

"తర్కించుకోవటమేవిఁటండీ?"

"అనవసరంగా నువ్వు ఆగ్రహం తెచ్చుకోకూడదు. మరి నిజం చెప్పుకోవాలంటే, యీ అబ్బాయి 'బుద్ధి మంతుడు', డబ్బుంది.... ఉద్యోగంకూడా మంచిదే! చదువుకున్నాడు గాబట్టి, మంచి భవిష్యత్తు వుందని మనం వూహించవచ్చు" నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు నరహరి.

"అయితే మీకు పూర్తిగా యిష్టమున్నట్టే? మనిషి అందచందాలు చూడనవసరం లేదేవిఁటి?" అంది కమల ప్లాటు మార్చుస్తూ.

"అదే నేనూ ఆలోచిస్తున్నాననుకో! అయినా అందం కొరుక్కుతింటామా?" మెల్లగా అన్నాడు.

"ఏమో నాకా వేదాంతమంతా తెలీదు. ఈ సంబంధం నా కిష్టంలేదు.... తర్వాత మీ యిష్టం...." అంటూ చరచరా లోపలికి పోయింది కమల.

నరహరి లోలోన నవ్వుకున్నాడు, "అసూయలేని మనుషులు ప్రపంచంలో వున్నారా?" అన్న ఆలోచనలో పడ్డం అతని తప్పేంకాదు....

## 6

భానుమూర్తికి ఉద్యోగం యిస్తానని ఆశచూపించిన పత్రికాధిపతి ఖాళీలేదని మొండిచెయ్యి చూపించాడు. ఆ చెప్పడం మొదటే చెప్పేస్తే యిన్నిసార్లు తిరగడం, ఆకాస్త ఆశపెట్టుకోవడం వుండేదికాదని బాధపడ్డాడు భానుమూర్తి. చేసేదిలేక నిరాశతో, నిస్పృహతో తిరుగు ముఖం పట్టాడు.

పాలిపోయిన మొహంతో గదిలో అడుగుపెట్టాడు.

"ఏమయిందండీ, వుద్యోగం దొరికినట్టేనా?" అంది సావిత్రి ఆసక్తితో.

భానుమూర్తి జవాబు చెప్పలేకపోయాడు. అతని మౌనం అర్థంచేసుకుందేమో మరి "దొరకలేదా!" అంది సావిత్రి నిరుత్సాహంగా.

"లేదు సావిత్రీ! ఆశ చూపించాడని గంపెడు వుత్సాహాన్ని పుంజుకుని వెళ్ళాను. ఏంలాభం?" బావుస మన్న చిన్నపిల్లాడిలా అన్నాడు.

సావిత్రి శిలాప్రతిమలా నిల్చుండిపోయింది. ఏమన డానికీ నోటమాట రాలేదు. ఆమె గుండెల్లో గుబులు బయలుదేరింది.

"ప్రయత్నించవల్సిందేమీ లేదా?" అంది మళ్ళీ ఆశతో.

"లేదుసావిత్రీ! అవకాశమున్నంతవరకూ ప్రయత్నించాను. ఇక లాభంలేదు." నిర్లిప్తంగా అన్నాడు.

కిటికీలోంచి వడగాడ్పు వీస్తోంది. సావిత్రి ఫాల భాగం స్వేదంతో నిండిపోయింది. ఆమె శ్వాస వేడి గాడ్పుతో చెలిమి కలుపుతోంది. ఏం చెయ్యాడమో ఆమెకు తోచడంలేదు.

ఇప్పుడేంచేస్తామండీ?" అంది దీనంగా. భానుమూర్తి గట్టిగ నిట్టూరుస్తూ కుర్చీలో కూలబడ్డాడు.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను సావిత్రీ! నాకు మాత్రం యీ జీవితం యేమీ నచ్చలేదు. మనం యెంత తేచి వచ్చినవాళ్ళమైనా యీ విధంగా భయంతో బితుకు బితుగ్గా, పరాయివూర్లో యెన్నాళ్ళిలా గడుపుతాం?" అన్నాడు.

"అయితే యేం చేద్దామంటారు?" వింతగా అతని ముహంలోకి చూస్తూ అంది సావిత్రి.

"మనం వాల్తేరు వెళ్ళిపోదాం" అన్నాడు.

సావిత్రి తృళ్ళిపడింది.

"మంచి మాటేనండీ! అక్కడికి వెళ్లామంటే, నలుగురి మధ్య బ్రతగ్గలమా? మనవాళ్ళ విషయం విడిచిపెడితే పరాయివాళ్ళే, మాటల్తో చిత్రవధ చేస్తారు. మన జీవితం దుర్భరంగా తయారవుతుంది. అందుకే, యిక్కడే వుండిపోదాం.... ఉద్యోగం దొరికేవరకూ, నా నగలున్నాయిగా!" అంది.

భానుమూర్తి బాధతోనే నవ్వేడు చిన్నగా, "నువ్వు మొదట్నుంచీ అదేపాట పాడుతున్నావు సావిత్రీ! డబ్బొస్తుందని మనం కావాలని అమ్మజూపితే, వాటి నికరమైన ధరలో సగంకూడా యివ్వరేమో! ఆ డబ్బైనా యెన్నాళ్లు వస్తుంది? ఉద్యోగం యెప్పుడు దొరుకుతుందో నిశ్చయంగా చెప్పలేం. అసలు దొరుకుతుందో, దొరకదోకూడా చెప్పలేం. ఉద్యోగం దొరక్కపోతే తర్వాత మనం చేయ్యాల్సిందేమిటి? అదీగాక మనవాళ్ళందరికీ దూరమై యెంతకాలం యీ ప్రచ్ఛన్న జీవితం గడుపుతాం చెప్పు? మనం చేసిన యీ తప్పుకి యింత ఘోరమైన శిక్షను అనుభవించాలా!"

"అక్కడికివెళ్తే మనం అనుభవించే శిక్ష ఘోరాతిఘోరంగా వుంటుందన్న విషయంమాత్రం మర్చిపోకండి. అందరూ మనల్ని అసహ్యించుకుంటారు. ఆడిపోసుకుంటారు, మన పరోక్షంలో నవ్వుతారు, మనం కనిపిస్తేచాలు వేలెత్తి చూపుతారు. ఎట్లా ఆ వాతావరణంలో బ్రతకడం చెప్పండి." బాధతో అంది సావిత్రి.

"నీ మాటలు వింటుంటే నాకు ఆశ్చర్యం ఓప్రక్కా, నవ్వోప్రక్కా వస్తున్నాయి సావిత్రీ! పెనుతుపాను వస్తుందని తెలిసికూడా ప్రయాణం సాగించి మార్గమధ్యంలో సందిగ్ధలోపడిన బాటసారిలావుంది నీ అవస్థ. ఇంత త్యాగం చేసిన దానివి ఆపాటి విమర్శలను యెదుర్కోలేకపోతే యింకేమిటి? మనం యిక్కడ హాయిగా బ్రతకలేక

పోతున్నాం. అదీగాక అక్కడ నిన్ను పంచప్రాణంగా చూసుకునే మీ అమ్మా, నన్నే నమ్ముకుని నామీదే తన భవిష్యత్తుని చేరవేసిన మా అమ్మా యెంతగా బాధ పడుతున్నారో ఆలోచించావా? మనం యిలా వచ్చివేయ డం అసహజమేమీకాదు. కాని, ఆ ఉద్రేకంలో మనం వాళ్ళని మర్చిపోయాం. ఇప్పుడు ఆ వుద్రేకంతోనే వారి దగ్గరికి పోదాం...." అన్నాడు.

సావిత్రికి తల్లి జ్ఞాపికి వచ్చింది. కళ్ళల్లో నీరు నింపు కుని, చేతులు చాచి ఆప్యాయంగా ఆమె తనని ఆహ్వా నిస్తున్నట్టుగా భ్రమపడింది. సావిత్రికి దుఃఖం వెల్లువలా పొంగుకొచ్చింది. ఆమె కళ్ళల్లో నీరు గిర్రున సుళ్ళు తిరిగింది. కాని అంతలోనే ఆమెకి తండ్రికూడా గుర్తు కొచ్చాడు. చింతనిప్పులా కణ కణ లాడుతున్న కళ్ళతో, పళ్ళు పట పట కొరుకుతూ లీలగా అగుపించాడు. భయంతో సావిత్రి వణికిపోయింది.

"మా నాన్నగారి యెదుట పడ్డానికే భయంగా వుం దండీ! అసలే ఆయన కోపిష్ఠి. మర్యాదకోసం, సంఘంలో గౌరవంకోసం ప్రాణాలైనా అర్పించడానికి సంసిద్ధంగా వున్న వ్యక్తుల్లో ఆయన వొకరు. అలాంటివ్యక్తికి మనల్ని గడప తొక్కనిస్తారన్న నమ్మకంలేదు." అంది నెమ్మదిగా.

"అది సహజం సావిత్రీ. ఆ ఉద్రేకం అల్లా వుం టుంది. క్రమంగా ఆ కోపం తగ్గి, చల్లబడేవరకూ మనం మౌనంతో సహనం వహిస్తే. వచ్చే నష్టమంటూ లేదు.

అనీగాక మనంవెళ్ళి వాళ్ళింట్లో వుండంగా? మా యింట్లో వుందాం....”

సావిత్రి షాక్ తిన్నది.

“ఎదురిల్లేకమా? ఎలా వుండేది?” అంది.

“పోనీ, మరో యిల్లు యెక్కడైనా అద్దెకు తీసుకుందాం. ఉన్నవూర్లో ఆమాత్రం పరపతివుంటదా యేమిటి!” అన్నాడు భానుమూర్తి.

“అలాగయితే సరే....” అయిష్టంగా అంది సావిత్రి. తిరిగి స్వస్థలం వెళ్ళడం సావిత్రికి సుతరామూ యిష్టం లేదు. కాని యేంచేస్తుంది? తప్పని పరిస్థితులు యేర్పడ్డాయి మరి!

“కాని....” అర్థోక్తిలో ఆపేశాడు భానుమూర్తి.

సావిత్రి విస్తుపోయి అతని మొహంలోకి చూసింది.

“మనదగ్గర డబ్బుకూడా లేదు సావిత్రీ, కనీసం టిక్కెట్లు కొనుక్కుందుకైనా వుండాలిగా!” అన్నాడు మళ్ళీ మూర్తి.

“పోనీండి ...నా నక్లెస్ అమ్మేద్దాం ...”

“వద్దు సావిత్రీ. నీ వస్తువు యే ఒక్కటీ అమ్మడం నాకిష్టంలేదు. నాచేతికున్నవుంగరమే అమ్మేస్తాను.ఖచ్చితంగా నలభైరూపాయలు యెనరైనా యిస్తారు. “వాటితో అవసరం ప్రస్తుతం తీరిపోవచ్చునేమోగాని, అక్కడికి వెళ్ళిన వెంటనే మన కాపరానికి డబ్బు అవసరముంటుందిగా!” అంది సావిత్రి.

"ఎందుకూ? అక్కడ మా అమ్మ ఉంటుంది" ధైర్యంగా అన్నాడు.

"ఆమెకూడా మనకి ఆశ్రయ మివ్వకపోతే?" కీడెంచి మేలెంచ మన్నారన్న ధోరణిలో అంది సావిత్రి.

భానుమూర్తి మందహాసం చేశాడు. "మా అమ్మ సంగతి నీకు తెలీదు సావిత్రీ! నేనంటే ఆమెకి ఆరోప్రాణం. నేను యేంచెబితే అదే ఆమెకు వేదవాక్యం. మనల్ని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తుంది. ఎవరేం అనుకున్నా, యెవరెన్ని విమర్శించినా, మా అమ్మమాత్రం ఆదరిస్తుంది" అన్నాడు.

"అయినా సరే, మన చేతిలో డబ్బు వుండడం యెందుకైనా మంచిది. నా వుంగరాలు రెండూకూడా అమ్మేయండి. అక్కడికి వెళ్ళాక చేయించుకోవచ్చు...." అంటూ చేతికున్న రెండు వుంగరాలూ తీసియిచ్చింది.

భానుమూర్తి రెండు చిటికెన వ్రేళ్ళకీ చెరొకటి తగిలించుకుని నవ్వుతూ "సరిగ్గా సరిపోయాయి. చూచేవా వుంగరాలు వ్రేళ్ళకివుంటే, ఒకొక్కప్పుడు యెలా వుపయోగపడతాయో!". అన్నాడు.

సావిత్రి చిన్నగా నవ్వింది.

"పద భోజనం చేద్దాం" అంటూ వెళ్ళాడు భానుమూర్తి. సావిత్రి అతణ్ణి అనుసరించింది.

భోజనంచేసి యిద్దరూ తిరిగివచ్చారు. "మరి నేనలా బంగారంకొట్టుకి వెళ్ళొస్తాను" అంటూ బైలుదేరాడు భానుమూర్తి.

"ఈ యెండలో యెందుకు వెళ్ళడమండీ? కాస్త చల్లబడినతర్వాత వెళ్ళకూడదూ?" అంది సావిత్రి.

"నీకు తెలీదు .. ఇప్పుడు వెళ్తే దుకాణంలో జన సమర్దం తక్కువగావుంటుంది." అంటూ బైటికి నడిచాడు.

మిట్టమధ్యాహ్నంవేళ, ఎండ నిప్పులు చెరుగుతోంది. అందుకే సావిత్రి తలుపులు దగ్గరగా చేర వేసుకుని మంచమ్మీద పండుకుని, వారపత్రిక చదువుతోంది. తలుపు కిర్రుమంది. తృళ్ళిపడి లేచింది సావిత్రి. రాజు పళ్ళికిలిస్తూ యెదురుపడ్డాడు.

"నువ్వేనా?" అంది తాపీగా.

"మరెవరనుకున్నారమ్మా? నేనే. బాబుగారుయేరీ?" అన్నాడు రాజు.

"ఊళ్ళో కాస్త పనుండి వెళ్ళారులే."

"అరెరె! అప్పుడే వెళ్ళిపోయారా?" అదోలా అన్నాడు రాజు.

"ఏం?" విషయమేమిటో అర్థంకాక అంది సావిత్రి.

"ఏంలేదమ్మా, మా మేనేజరుగారు డ్రింక్సు యిచ్చి రమ్మన్నారు.

సావిత్రి ఆశ్చర్యపోయింది.

"మీ మేనేజరుగారు యిమ్మన్నారా? అదీ యీ సమయంలోనా? ఎవరైనావింటే నవ్వుతారోయ్. మా కేమీ అవసరంలేదు వెళ్లు...." సాలోచనగా అంది సావిత్రి.

"అలా అంటే యెలా చెప్పండి? మీకోసం ప్రత్యేకించి ద్రాక్షరసం చేయించారు. మీరైనా తీసుకోండి...."

సావిత్రి షాక్ తిన్నది. మేనేజరు మనస్తత్వమేమిటో అమెకి సొంతం అవగాహనమయింది. "ప్రత్యేకంగా మాకోసం తయారు చేయించడమేమిటోయ్!" కటువుగా అడిగింది.

రాజు తడబడ్డాడు.

"అబ్బెబ్బె యేమీ లేదండీ, ప్రత్యేకమేమీ లేదండీ." తొట్రుపడుతూ చెప్పాడు.

సావిత్రి మొహం జేవురించింది. "నీ తెలివి తేటలు యిక్కడ ప్రదర్శించకోయ్ వెధవాయ్ ... మీ యజమానికి చెప్పు యిలాంటి వైధవ వేషాలు వెయ్యొద్దని. తెలిసిందా? వెళ్ళు." అంటూ రెండడుగులు ముందుకు వేసింది సావిత్రి.

రాజు కంపించిపోయి ఒక్కగంతులో బైటపడ్డాడు. సావిత్రి తలుపు దభీమనివేసేసి గడియపెట్టింది. "ఛీ! యేం మనుషులో యేమిటో!" అనుకుంది విసుగ్గా. మరో గంటకి భానుమూర్తి వచ్చాడు. "వెళ్ళినపని అయిందాండీ!" అంది తలుపు తెరుస్తూనే.

"ఆ! యిందులో విశేషమేముంది! మనం బంగారం అమ్ముతున్నాం. మన అవసరం గ్రహించి కొనేవాళ్ళు అతి చౌకలో కొనేస్తున్నారు. ఇంతకీ నువ్వు తలుపులు బిడాయించుకున్నావేం!" అన్నాడు నవ్వుతూ భానుమూర్తి.

సావిత్రి అంతా పూసగుచ్చినట్టు చెప్పింది. భాను మూర్తి వుగ్రకోపంతో వుద్రిక్తుడయ్యాడు. అతనికళ్లు ఎర్రని విద్యుద్దీపాల్లా మెరిశాయి. పెదాలు వణికాయి. కనుబొమలు ముడిపడ్డాయి.

"ఆ వెధవ వుద్దేశం ఏవిఁటో అంతు తేల్చుకు వస్తానుండు" అంటూ, వెనక్కి తిరిగాడు.

సావిత్రి గాభరాపడి అడ్డుకుంది. "మీకు పుణ్యముంటుంది, అలా తొందరపడకండి. మనం యీ వూరికి కొత్తవాళ్ళం. మండుతున్న కర్ర దానంతట అదే నుసి అవుతుంది. మనం యిక్కణ్ణించి యెలాగూ వెళ్ళిపోవాలనుకుంటున్నాం. ఈ రాత్రే మకాం ఎత్తేస్తే పోయేదిగా, ఈ స్వల్ప వ్యవధిలో యీ గొడవలన్నీ ఎందుకు చెప్పండి? నేనే ఆ వెయిటర్‌కి బుద్ధి చెప్పి పంపాను" అంది.

భానుమూర్తి కోపాన్ని అణచుకుంటూ కుర్చీలో కూలబడ్డాడు.

ఆరాత్రే వాళ్లు ప్రయాణం కట్టారు.

## 7

జగన్నాథం అప్పుడే ఆఫీసునుండి వచ్చాడు. బడలికతో కుర్చీలో కూలబడ్డాడు. సీత కాఫీ తెచ్చి యిచ్చింది. జగన్నాథం ఒక్క గుటకలో కప్పు ఖాళీచేసి యిచ్చేస్తూ, "ప్చ చల్లారిపోయిందక్కా కాఫీ!" అన్నాడు నవ్వుతూ.

"అంత వేడిగా వుంటేనూ, చల్లారిపోయిందంటు న్నావేవిటా?! బావుంది.... మరికొద్దిరోజులు ఆగు పెళ్ళాం వస్తే, ఆవిడ నీ కెప్పుడు కాఫీ కావాలంటే అప్పుడే కాచి యిస్తుంది. మా సరస్వతికి వూరంత ఓపిక ఉంది.... పరవా లేదు. వాళ్లింట్లో వంటపనంతా అదే చేస్తుందట...." అంది నవ్వుతూ సీత.

జగన్నాథం కాస్త సర్దుకుని కూచున్నాడు.

"అయితే అక్కా, సరస్వతి అందంగా వుంటుందా?" అన్నాడు బిడియపడుతూనే.

"నువ్వు చూశావు కదట్రా!"

"చూసి చాలా రోజులయిందిలే! అందుకే యిప్పుడెలా వుందో ఊహించలేకపోతున్నాను."

"చాలా అందంగా వుంటుందిరా! అందుకేగా, నాకీ తాపత్రయమంతాను. పరాయి పిల్లయితేమాత్రం వృద్ధి రిస్తుందా యేవిటి? పిల్ల మంచి తెలివైంది కూడాను. స్కూలు ఫైనల్ పరీక్ష రాసింది. తప్పక ప్యాసవుతానని ధైర్యంగా చెప్తోంది. అసలు దాన్ని వాళ్ళ మేన మామకే యిస్తామని ఆ మధ్యను అన్నారులే. కాని, ఆ ప్రయత్నం విరమించబడింది...."

ఆ ప్రయత్నం ఎందుకు మానుకున్నారో తెలుసుకో వాలన్న ఆసక్తి పుట్టింది జగన్నాథంకి.

"కారణమేమిటక్కా!" అన్నాడు.

"అవన్నీ నీ కెందుకులేరా!" అనేసింది తేలిగ్గా.

జగన్నాథంకి ఆసక్తి యినుమడించింది. "చెబితే యేం పోయిందక్కా! చెప్పుమూ" గోముగా చిన్నపిల్లాడిలా అన్నాడు.

జవాబు చెప్పకపోతే యిక తమ్ముడు విడిచిపెట్ట డన్న విషయం ఆమెకు తెలుసు. అందుకే భానుమూర్తి సావిత్రిని లేవదీసుకుపోయిన వైనమంతా చెప్పింది సీత.

"బ్రహ్మచారి ముదిరితే యిదే పర్యవసానమేమో!" కొత్త థియరీని కనిపెట్టినట్టుగా అదోలా నవ్వుతూ అన్నాడు జగన్నాథం.

సీత గతుక్కుమంది, మొహం చిట్లించుకుంది.

"పర్యవసాన మేమిట్రా! పోయేకాలం.... అదీ ఒక బ్రతుకేనా! ఎంతమంది ఎన్ని ఆడిపోసుకుంటున్నారు? వాళ్ళు యెప్పుడైనా కంటబడితే, పేడనీళ్లు జల్లరూ: ఛీ! ఛీ! కుక్క బ్రతుక్కీ, వీళ్ళ బ్రతుక్కీ తేడా యేముంది?" అంది చీదరించుకుంటూ. కొంపదీసి వీడు కూడా యీ పద్ధతి అవ లంబించడుకదా అన్న భయం లోలోన వుండనేవుంది.

"వాళ్ళమీద అంత కోపమెందుకక్కా! అగ్ని సాక్షిగా, అందరి సమక్షంలో వరుడు, వధువు మెళ్ళో తాళి కట్టడాన్ని పెళ్ళిగా వ్యవహరిస్తున్నారు. సంసారాన్ని యెది రించి, కలిసిన మనసుల్ని విడదీసుకోవడం యిష్టంలేక యెక్కడికో పోయి పెళ్ళిచేసుకునే దాన్నే లేచిపోవడమంటారు

న్నారు. దూరంగా ఆలోచిస్తే రెండింటి లక్ష్యమూ ఒకటే! మార్గాలు మాత్రం వేరు. అలాంటప్పుడు లేచిపో యిన వాళ్ళను యెందుకు ఆడిపోసుకోవడమో, అర్థంకాదు'' అన్నాడు జగన్నాథం.

సీత తమ్ముడి మాటలు విని మరింత ఆశ్చర్యపో యింది. అతడిమీద చెప్పరానంత కోపం, అసహ్యం జనించాయి. వీడికీ బుద్ధులు యెలా అబ్బాయా అనుకుంది.

"చాలించరా యిక, నా దగ్గర అన్నావు గాబట్టి సరిపోయింది. అమ్మా, నాన్నల దగ్గరంటే తెలిసివచ్చేది. ఎందుకన్నా మంచిది....నీకు వేగిరం ఆ గుదిబండ మెడకు తగిలించేయాలి. కాలం యేమీ మంచిదికాదు."

"గుదిబండా!" ఆశ్చర్యంగా అన్నాడు జగన్నాథం. మళ్ళీ అర్థంచేసుకుని "ఓ! పెళ్ళి చేస్తారన్నమాట ... బావుంది బావుంది ...మంచి పదమే వాడావు. 'స్త్రీ' కి మారు పేరు 'గుదిబండ' అని సి అంతట నువ్వే చెప్పడం, నా కెంతో సంతోషంగా వుందక్కా! మగవాడి స్వేచ్ఛకి సంకెళ్లు వేసి, జీవితాన్ని నడిపింపజేసే స్త్రీకి యీ నిర్వచనం అక్షరాలా సరిపోయింది ..." నవ్వుతూ అన్నాడు.

సీతకి కోపం వెచ్చిపోయింది. "వితండవాదం ఎక్కడ నేర్చావురా? ఈవిధంగాఅర్థంలేకుండా వాదిస్తే నీతో యెవరు సరిపోతారు! నాన్నగారికి ఉత్తరం రాస్తానుండు. త్వరలో మూహూర్తం చూడమని. మా సరస్వతి వస్తే, అప్పుడే

నీ నోటికి తాళం పడుతుంది'' అంది.

"అదే నే నంటున్నదీను .... ఆ అమ్మాయివస్తే, నా ముక్కుకి తాడువేసి నడిపిస్తుంది. నా మెడలో గుదిబండ అవుతుంది'' నవ్వుతూ అన్నాడు.

సీతకికూడా నవ్వాగింది కాదు. "పో వెధవా!'' అంటూ నవ్వుకుంటూనే వెళ్ళిపోయింది.

జగన్నాథం తృప్తిగా నవ్వుకున్నాడు. 'సరస్వతి' .... యెంత బావుంది పేరు? మనిషికూడా బాగానే వుంటుందట, 'లక్కీఛాన్సోయ్ జగన్నాథం! చదువుకున్న సుందరి. తలిదండ్రులకు ఒక్కగానొక్క కూతురు. అల్లారు ముద్దుగా పెరిగిన అతివ. ఆస్థి అంతా ఆమెదే! మరింకేం? అల్లుడి హోదా మంచి స్థాయిలో వుంటుంది ...'అనుకున్నాడు జగన్నాథం ఊహాలోకంలో విహరిస్తూ;

"మావయ్యా యీ లెఖ్ఖ చెప్పవూ?''అనుకుంటూ వచ్చాడు పదేళ్ళ ప్రసాద్.

తన సుందర స్వప్నాన్ని చెదరగొట్టిన చిన్న మేనల్లుడిపై కోపం వచ్చింది జగన్నాథంకి. కాని ఆ పసివాడి నవ్వు మొహం చూసి కరిగిపోయాడు. "ఏదీ యిలా తే!'' అంటూ పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు.

* * *

భానుమూర్తి, సావిత్రి వాల్తేరు స్టేషన్‌లో దిగారు. ఒక్కొక్కరి చేతిలో ఒక్కో సూటుకేసు మాత్రమే వుంది.

ఇరువురి గుండెలూ, మిలిటరీ కవాతులా కొట్టుకుంటు న్నాయి. సావిత్రి హృదయం మాత్రం కాస్త జోరుగా స్పందిస్తూంది. ఎంత నాగరికత వున్నా స్త్రీ యేగా!

దిగే జనం, యెక్కే జనంతో ప్లాటుఫారం కిటకిట లాడుతోంది. ఎవరైనా అగుపిస్తారేమోనని బెదురుచూపులు చూశాడు భానుమూర్తి. ఎవరికంటా పడకూడదని కాదు అతని ఉద్దేశం. దిగీ దిగిన వెంటనే యెవరికంటాపడ్డం అతనికి యిష్టంలేదు. కాని మనకి యిష్టంలేనివే ఒకొక్కప్పుడు తప్పనిసరిగా సంభవిస్తూ వుంటాయి. అది యెవరూ తప్పించు కోలేరు.

"ఏమిటోయ్ మూర్తీ" అన్న పలకరింపు హఠాత్తుగా ఆటంబాంబులా విన్పించింది భానుమూర్తికి. ఒక్కసారిగా వొళ్ళంతా చెమటపోసింది. కాళ్ళు వణికాయి. అప్పటికే నారాయణ యెదురుగా వచ్చేశాడు. మందహాసంతో మూర్తి మొహంలోకి చూశాడు. భానుమూర్తి కృత్రిమ మైన నవ్వు తెచ్చిపెట్టుకొని "నువ్వేనట్రా" అన్నాడు.

"ఇదే రావడమనుకుంటాను." అన్నాడు నారాయణ.

"చూపిస్తున్నావుగా" అన్నాడు భానుమూర్తి అతి కష్టంమీద.

"ధైర్యమంటే నీదేరా! నీ గురించి యెవరెన్ని అను కుంటేనేం? కలసిన మనసులు విడిపోకుండా ధైర్యంచేసి ఫలితం పొందావు. కాని ఒక్క విషయంరా! ఆఫీసుకి శెల వైనా పెట్టావు కాదేం?"

"అదేన్రా పొరపాటయింది. ఏమీ గొడవ జరగ డంలేదు గదా!"

"జరక్కపోవడమేమిటి? ప్రస్తుతం నీ ఫైలు హెడ్ క్లార్కు దగ్గరుంది. ఆయన రేపో, నేడో నోట్ ఫుటప్ చేస్తాడు గామోసు. నువ్వెలాగూ వచ్చేశావు గాబట్టి ఓసారి అతణ్ణి కలుసుకోవడం మంచిదేమో!"

"అలాగేన్రా!"

"అన్నట్టు నువ్విప్పుడెక్కడికి వెళ్తావు?" అన్నాడు నారాయణ

"అదేమిటాలా అడుగుతున్నావ్? మా యింటికి వెళ్తాను" అనాలోచితంగా అనేశాడు భానుమూర్తి. కాని సావిత్రికి చెప్పినమాట మాత్రం అదికాదు. అందుకే ఆమె గతుక్కుమంది.

"మీ యింట్లో యెవరో అద్దెకుంటున్నారుగా" అన్నాడు నారాయణ.

సావిత్రి తృప్తిపడిందా మాట విని.

"అద్దెకుంటున్నారా! అయితే, మా అమ్మ ఇక్కడ లేదన్నమాట...." సాలోచనగా అన్నాడు భానుమూర్తి.

"లేదురా, మీ అక్కగారింటికి వెళ్ళిపోయిందని రామానుజంగారు చెప్పారు."

"అయితే యిప్పుడెలారా? మేం యెక్కడుంటాం? ఏదైనా నీ దృష్టిలో అద్దెకు దొరికే యిల్లుందా?" అన్నాడు మూర్తి.

నారాయణ రెండు నిమిషాలు ఆలోచించాడు. తమ వీధిలోనే సుబ్రహ్మణ్యంగారింటో ఓ భాగం ఖాళీగా వున్నట్టు ఆ మధ్య యెవరో చెప్పడం గుర్తుకొచ్చింది. "సుబ్రహ్మణ్యం అని ఒకతను వున్నాడులే, అతనింట్లో ఒక భాగం ఖాళీగా వుండాలి అడిగి చూద్దాం...." అన్నాడు.

"పదయితే, ఇప్పుడే వెళ్దాం. ఈవిణ్ణి అంతవరకూ వెయిటింగ్ రూమ్‌లో కూచోమందాం ..."అంటూ వెయిటింగ్ రూమ్‌కి దారితీశాడు సావిత్రితోపాటు భానుమూర్తి. వెయిటింగ్‌రూమ్ బేరర్‌కి ఓ పావలాకాసు యిచ్చేస్తూ, ఆమెకి ఏం కావాలన్నా చూస్తుండమని చెప్పి నారాయణతోపాటు బైలుదేరాడు.

సుబ్రహ్మణ్యంగారు రిటైర్డు గవర్నమెంటు ఉద్యోగి. ఉద్యోగం చేస్తున్నప్పుడే సలక్షణమైన ఓ డాబా యిల్లు కట్టించుకున్నాడు. పరమ చాంధసుడు. నారాయణ, భానుమూర్తి వెళ్ళేసరికి అతను న్యూస్ పేపరు చదువుతున్నాడు.

"నమస్కారమండీ!" అన్నాడు నారాయణ.

సుబ్రహ్మణ్యం, కళ్ళద్దాలు సర్దుకుంటూ "నమస్కారం....ఏమిటోయ్ యిలా వచ్చావు?" అన్నాడు.... అంటూనే భానుమూర్తివేపు చూసి "నిన్ను ఎక్కడో చూశానబ్బాయ్. మీ నాన్నగారెవరు?" అన్నాడు.

"ధర్మారావుగారండి...." జవాబిచ్చాడు భానుమూర్తి.

"ఓహో!" కనుబొమ్మలు చిట్లిస్తూ అనేసి "మీ యింటిప్రక్కనుండే రామానుజం గారింటికి వస్తుండేవాణ్ణి. అప్పుడెప్పుడో నిన్ను చూసివుంటాన్లే. అన్నట్టు నువ్వీమధ్య యెక్కడికో పరారీ అయినట్టు విన్నానే" అన్నాడు.

భానుమూర్తి నీరైపోయాడు. ఏం చెప్పడానికీ నోట మాటరాలేదు. నారాయణవేపు అదోలా చూశాడు.
"బంధువులింటికి వెళ్ళాడండీ." అని సరేశాడు నారాయణ.
"పోనీ అవన్నీ మనకెందుగ్గానీ, యింతకీ నువ్వొచ్చిన పనేమిటో చెప్పావు కాదు?"

"మీయింట్లో ఓ భాగం ఖాళీగాపడుంది కదండీ! మావాడికి యిల్లుకావాలి తక్షణం. మీరు యెంత చెప్తే అంత అద్దె యివ్వడానికి సిద్ధంగావున్నాడు," అన్నాడు నారాయణ.

సుబ్రహ్మణ్యం అదోలాచూచాడు. "అదేమిటోయ్ స్వంతయిల్లు వదులుకొని అద్దెకుండడమేమిటి?" అన్నాడు.
"ఆయిల్లు అద్దెకిచ్చేశారండీ."
"అలాగా! నాకు తెలీదులే....ఒక్కడే వుంటాడా?"
భానుమూర్తి ఆ యక్షప్రశ్నలు వినలేక గుటకలు మింగుతున్నాడు.
"లేదండీ....ఇద్దరు...."
"ఇతడూ, వాళ్ళమ్మగారూ గామోసు"
నారాయణకి యేంచెప్పడమో తోచలేదు. చెప్పకపోయినా చిక్కే అనుకున్నాడు.

"పిళ్ళ అమ్మగారు తర్వాతవస్తారు. ప్రస్తుతం దంపతులు వుంటారు...."

"దంపతులా? ఇతడికి పెళ్ళెప్పుడయిందోయ్?.... ఆ! ఆ! అర్థమయ్యింది. ఎవర్నో లేవదీసుకుపోయాడన్న వగంతికూడా పుట్టిందిగా...."అంటూ చర్రున కుర్చీలోంచి లేచి, "లేవదీసుకుపోయిన ఆ పతితతో మా యింట్లో కాపరం పెడతాడన్నమాట? నీకు మరే యిల్లూ అగుపించ లేదూ? హూ! వెళ్ళు ...వెళ్ళు, తగుదునమ్మా అని రికమెండ్ చేస్తున్నావు ..." వుక్రోషంతో అన్నాడు.

భానుమూర్తి మనస్సు చివుక్కుమంది. కడుపులో చేయిపెట్టి యెవరో కెలుకుతూ వున్నట్టుగా బాధపడ్డాడు. బాధతో వెనక్కితిరిగాడు. సుబ్రహ్మణ్యం ప్రవర్తన చాలా అసభ్యంగా కనిపించింది నారాయణకి. కళ్ళనిండా కోపం వచ్చింది. కాని యేంచేస్తాడు? ఆయన వయసులో పెద్దవాడు....ఆ గౌరవాన్ని అతిక్రమించలేక పోయాడు. భారంగా వెనక్కితిరిగాడు. తనకంటే ముందుగాపోయి బైట నుంచున్న భానుమూర్తినిచూసి జాలిపడ్డాడు.

నారాయణకి యేం చెయ్యాడమో తెలీలేదు. 'ఎవరింటికి వెళ్ళినా యివేప్రశ్నలూ, యిదే సమాధానం వస్తుందా? ఏమో రావచ్చు'....అనుకున్నాడు....అనుకుని తీవ్రంగా ఆలోచన సాగించాడు. మెరుపులాంటి పరిష్కార మార్గం స్ఫురణకొచ్చింది.

"ఒకేయ్ మూర్తీ! నువ్వు స్టేషనుకి వెళ్ళివుండు, నేనిప్పుడే అక్కడికివస్తాను. ఏదో ఒక యేర్పాటుచేసి వస్తాలే" హామీ యిచ్చినట్టుగా అన్నాడు నారాయణ

"వాతావరణం యింత ఘాటుగా వుంటుందని అనుకోలేదురా" దీనంగా అన్నాడు భానుమూర్తి.

"దిగులుపడకురా, ఏం ఫరవాలేదు. ఏదో యేర్పాటు నేను చేస్తాంగా" అన్నాడు నారాయణమూర్తి భుజం తట్టుతూ.

"మా కోసమే నిన్ను భగవంతుడు స్టేషనుకి పంపించాడేమో!" అన్నాడు భానుమూర్తి కృతజ్ఞత తెలిపే విధం తెలీక.

"అంతదూరం పోకు, నువ్వెళ్ళు" అంటూ యింటి ముఖం పట్టాడు నారాయణ.

సంఘ నియమాల్నీ, కట్టుబాట్లుల్నీ అతిక్రమించి ప్రవర్తించేవారి జీవితాలు యెలా వుంటాయో, వాళ్ళు యెలాంటి విపరీత సమస్యల్ని యెదుర్కోవల్సి వస్తుందో, అభిమానం చంపుకుని యెన్నెన్ని మాటలు వినవల్సి వస్తుందో, భానుమూర్తికి యిప్పుడర్థమౌతోంది. కాని యేంచేస్తాడిప్పుడు? 'ప్రవాహానికి యెదురీదక తప్పదు' అనుకుని నిర్జీవంగా స్టేషన్ వేపు నడిచాడు.



# 8

భానుమూర్తి స్నేహ బృందంలో ఒకడు నారాయణ మంచి వుత్సాహవంతుడు. ఎప్పుడూ సరదాగా మాట్లాడే స్వభావం గలవాడు. భానుమూర్తికీ, అతనికీ యెంతో అనుబంధంవుంది. భానుమూర్తి సేషన్లో దిగేసరికి, అతడే అగుపించడం భానుమూర్తి అదృష్టమే.

నారాయణకి చెంగల్రావు పేటలో ఓ డాబా యిల్లుంది. తండ్రిలేడు. తల్లీ, అన్నయ్యామాత్రమేవున్నారు. వాళ్ళన్నయ్య కామేశం. భార్య చనిపోతే మళ్ళీ పెళ్ళి చేసుకోవడం మానేశాడు. అన్నదమ్ములిద్దరూ తల్లి మాటకి కట్టుబడి వుంటారు.

నారాయణకి మెరుపులా మెరిసిన ఆలోచన ఒక్కటే. స్నేహితుడిగా తను భానుమూర్తిని ఆ క్లిష్ట సమయంలో ఆదుకోవాలంటే తమయింట్లో ఓ గది యివ్వడమే! ఆ వుద్దేశంతోనే యింటికి వచ్చాడు. "అత్తయ్య రాలేదమ్మా!" అంటూ ప్రవేశించాడు నారాయణ.

పార్వతమ్మ ఆశ్చర్యమేమీ ప్రకటించ లేదు. "నువ్వు వెళ్ళిపోయాక వుత్తరం వచ్చిందిరా మీ అత్తయ్య దగ్గర్నుంచి.... ఇప్పుడు రాదట" అంది.

"వెళ్ళినందుకు వృధా అవ్వలేదు లే. నా స్నేహితుడు భానుమూర్తి తెలుసుకదూ!"

"ఔను! ఆమధ్య వాళ్ళ యింటి యెదురుగా వుండే అమ్మాయిని లేవదీసుకు పోయాడనిఅంతా అనుకున్నారు. అతనేగా!" అంది పార్వతమ్మ.

"లేవదీసుకు పోవడమేవిఁటే! వాళ్ళిద్దరూ ప్రేమించు కున్నారు. పెళ్ళికి పెద్దలు ఒప్పుకోకపోతే యింటి నుండి పరారీ అయ్యారు. దానికోసం వూరంతా గుప్పుమని పోయింది. పెళ్ళికి సమ్మతించని పెద్దల్ని, యెవరూ యేమీ అనరు" తనకి పూర్తిగా ఆ విషయాలు తెలీకపోయినా, యేదో సర్ది చెప్పాడు నారాయణ.

"ఏవిఁటోరా! యీ కాలం పిల్లల మనస్తత్వాలూ, మాటలూ వింతగావుంటాయి. ఇంతకీ నువ్వు చెప్పే దేవిఁటి?" అంది కళ్ళద్దాలు సర్దుకుంటూ.

"ఏవీఁలేదమ్మా! ఆ భానుమూర్తి సతీసమేతంగా వచ్చేశాడు. వాళ్ళయిల్లు అద్దెకిచ్చేశారు కదూ? యిప్పుడు వాళ్ళకోయిల్లు కావాలి." అన్నాడు మరింకేమీ చెప్ప కుండా.

"అయితే నువ్వనేదేవిఁటి?"

"మనింట్లో ఓగది ప్రస్తుతానికి వాళ్ళకిస్తే బావుం టుందేమోనని" అన్నాడు.

పార్వతమ్మ అదోలా కొడుకువేపు చూసింది.

"మనింట్లోనా?" కళ్ళింతవి చేసుకుంటూ అడిగింది.

"ఔనమ్మా! మనం యెంతమంది వున్నాం. ముగ్గుర మేగా?"

"ఔననుకో! కాని అలాంటివాళ్ళని మనింట్లో తెచ్చిపెట్టుకోవడం నాకిష్టంలేదురా! నలుగురూ ఏమనుకుంటారు?"

నారాయణ కాస్తంత కలవరపడ్డాడు. ఎంత ఆశతో వచ్చాడో అంతగా నిరుత్సాహపడ్డాడు.

"అదేవిఁటమ్మా అలా అంటావు? వాళ్ళిద్దరూ లేచిపోయిన వాళ్ళనేగా నీ అభ్యంతరం? ఇప్పుడు వాళ్ళిద్దరూ వివాహం చేసుకొన్న దంపతులు. ఒకసారి ఏదో తప్పటడుగు వేశారని జీవితాంతం అందరూ వాళ్ళని అసహ్యించుకోవడం, క్రూరమృగాల్ని చూసినట్టు చూడ్డం యేమీ బాగులేదమ్మా! అందరూ వాళ్ళపట్ల అంత నిర్దయగా ప్రవర్తిస్తే వాళ్ళేంకావాలి? కొద్దిరోజులపాటు మనం ఆశ్రయమిస్తే, తర్వాత వాళ్ళింట్లోకే మార్చేస్తాడు ..." ప్రాధేయపూర్వకంగా అన్నాడు నారాయణ.

పార్వతమ్మ మనసు కాస్తంత కరిగింది. "మీ అన్నయ్య యేమంటాడో యేవిఁటోరా" అంది మెల్లగా.

నారాయణ మనసు కాస్తంత తాపీ పడింది.

"అన్నయ్యకి నేను నచ్చజెప్తానమ్మా! ఆ భారం నామీద వెయ్యి. భానుమూర్తి అన్నయ్యకీ తెలుసు."

కొడుకుమాట కొట్టిపారేయాలని పించలేదు పార్వతమ్మకి. భానుమూర్తి మీద క్రమంగా సానుభూతి కలిగింది.

"సరే! మీ అన్నయ్యతో చెప్పిచూద్దాం" అంది.

అలా వాయిదా వెయ్యడం నారాయణకి నచ్చ లేదు. విసుగ్గా తల గోక్కున్నాడు. భానుమూర్తి యెంత వరకు వెయిటింగ్ రూమ్‌లో వుంటాడు? అతడి పరిస్థితి యెవరికీ తెలీదు అనుకుని "అన్నయ్యా ఆఫీసుకి వెళ్ళి మాట్లాడి వస్తానమ్మా" అంటూ లేచాడు.

పార్వతమ్మ చిన్నగా నవ్వుకుందేగాని యింకేమీ అన లేదు. 'స్నేహితుడంటే పిడికి యెంత అభిమానం!' అను కుంది మనసులో.

నారాయణ వడగాడ్పులు కొడ్తున్న యెండని సహితం లెక్క చెయ్యకుండా వాళ్ళ అన్నయ్యదగ్గిరికి వెళ్ళాడు.

"ఏంరా యిలా వచ్చావు?" అన్నాడు కామేశం ఆత్రుతగా.

నారాయణ 'గాభరా పడ'కన్నట్టుగా చిన్నగామంద హాసం చేస్తూ పక్క నేవున్న కుర్చీలో ఆసీనుడయ్యాడు. తను చెప్పదలచుకున్నదంతా పూసగుచ్చినట్లు సానుభూతి కలిగేట్టు చెప్పాడు. గృహాన్వేషణలో బైలుదేరడం, సుబ్రమణ్యం చీవాట్లు పెట్టడం అన్నీ చెప్పాడు. తమ్ముడు చెప్పినదంతా సావకాశంగావిన్న కామేశం నిట్టూర్చాడు.

"అయితే మనం వాళ్ళకి సహాయం చేద్దామన్న అభిలాషతో వున్నాంరా, కాని లోకం అంతదూరం ఆలోచించదు. లేచిపోయిన వాళ్ళకి ఆశ్రయమిచ్చామని మన గుణగణాల్ని కూడా విమర్శిస్తారు. చిలవలకి పలవలు కల్పించి కథలల్లి ప్రచారం చేస్తారు. మనం ముందుగా అవన్నీ ఆలోచించడం అవసరమేమో" అన్నాడు.

విశాలభావాలుగల అన్నయ్య సహృదయంతో తన కోరికను మన్నించి, స్నేహితుణ్ణి ఆదుకుందుకు అంగీకరిస్తాడని విశ్వసించాడు నారాయణ. కాని కామేశంనుండి యిలాంటి జవాబు రావడం ఆశ్చర్యం, దానికితోడు నిరుత్సాహం కలిగించాయి.

"నువ్వు కూడా అలాగే అంటావని నేనెప్పుడూ అనుకోలేదన్నయ్యా! అందరూ వాళ్ళని అధఃపాతాళానికి తొక్కడానికి ప్రయత్నించితే, యింక వాళ్ళకి చోటేదీ? ఇలాగే వాళ్ళు నశించిపోవల్సిందేనా?" యెంతో అనుభవం వున్న వ్యక్తిలా అన్నాడు నారాయణ

తమ్ముడి మాటలు కాస్త చిత్రమనిపించాయి కామేశంకి. ఆ మాటల్లోని భావం అవగాహనచేసుకున్నాడు. ఆలోచనలో పడింతతని మెదడు. ప్రపంచంలో అందరూ మంచివాళ్లే, సన్మార్గులే వుంటారని యెవరూ చెప్పలేరు. అసలు మంచివాళ్ళు యెంతమంది ఉంటారు! వేళ్ళపై లెఖ్ఖబెట్టవల్సిన యే కొద్దిమందో తప్పించి అంతా ఏదో ఒక రూపంలో తప్పుచేసినవాళ్లే! తప్పుచేసిన వాళ్ళందర్నీ దూరంగా వుంచగలుగుతున్నారా? లేదు.... ఏకొద్దిమందికో ఆ న్యాయం కేటాయించబడింది. అలా యెందుకుజరగాలి? జవాబెవరు చెప్తారు! తనలో విశాల భావాలున్నాయని అనుకోవడం యెందుకు? ఆ భావాల్ని యెక్కడ వ్యక్తపరుస్తున్నాడు. రాబోయే పరిణామాలకి భయపడక భానుమూర్తిని తనెందుకు ఆదుకోకూడదు? తమ్ముడిమాట ఎందుకు నిలబెట్టకూడదు? ... ఈ ఆలోచనలతో ఒకనిర్ణయా

నికి వచ్చాడు. "నువ్వు చెప్పిందికూడా నిజమేనా?! మనింటికి వాళ్ళని తీసుకొచ్చేయ్.... ముందుగది ఖాళీ చేసియివ్వు...." అనేశాడు.

నారాయణ ఆనందానికి అంతులేకపోయింది. అతని హృదయం గంతులేసింది. అన్నయ్యను కౌగలించుకోవాలనుకున్నాడు గాని, అది ఆఫీసు అని గుర్తుకొచ్చి మానేశాడు.

"వస్తా నన్నయ్యా!" అంటూ ఉత్సాహంగా బైటికి నడిచాడు. తిన్నగా స్టేషనుకి దారి తీశాడు.

భానుమూర్తి వెయిటింగ్ రూమ్ ఆవరణలో నుంచుని యిటూ, అటూ అయోమయంగా చూస్తున్నాడు. ఆ చూపులు నారాయణకోసమే వెదుకుతున్నట్టున్నాయి. నారాయణ కంటబడేసరికి ప్రాణంలేచివచ్చినట్టయింది భానుమూర్తికి. నారాయణకి ఎదురుగా వస్తూ "ఏమయిందిరా!" అన్నాడు ఆతృతగా.

"ఏర్పాటయిందిలే" అన్నాడు నారాయణ.

అంతవరకూ కొట్టుకుంటున్న గుండెలు కాస్త తాపీ పడ్డాయి భానుమూర్తికి.

"ఎక్కడ?" మరింత ఆసక్తి చూపించాడు.

"మా యింట్లోనే ఓ గది ఖాళీచేస్తున్నాం. యెవరూ యివ్వకపోతే పోయిందేమీ లేదులే...."

"మీ యింట్లోనా!" వింతగా అన్నాడు మూర్తి.

"ఏం? నీకు అభ్యంతరమా?" తనింతా శ్రమపడి, అందరికీ నచ్చజెప్పి వస్తే పీడిలా అంటాడేవిటీ, అన్న ఆశ్చర్యంతో అడిగాడు నారాయణ.

"అభ్యంతరం యేమీ లేదురా! కాని మీ అమ్మా, అన్నయ్యా ఒప్పుకున్నారా అని."

నారాయణ చిన్నగా నవ్వాడు.

"ఒరేయ్ బ్రదర్, యీ నారాయణ అంత తెలివి తక్కువ దద్దమ్మని యెలా అనుకున్నావురా! అన్నీ నిశ్చయించే వచ్చాను. నేను వెళ్ళి అక్కడ గది శుభ్రం చేయిస్తాను.... ఈలోగా మీరిద్దరూ వచ్చేయండి.... ఆఁ.... భోజనాలయ్యాయా!"

"అయిన్నైరా. నిజంగా నారాయణా, మనసిచ్చిన స్నేహితుడంటే నిజమైన అర్థం యిప్పుడు భోధపడుతోంది....! నీ మేలు ఎప్పుడూ మర్చిపోలేను" అన్నాడు భానుమూర్తి స్నేహితుడి రెండు చేతులూ పట్టుకుంటూ.

"దానికేం లేరా! వస్తామరి..." అంటూ యింటి ముఖం పట్టాడు.

ఉత్సాహంతో పురకలు. వేసింది భానుమూర్తి హృదయం .... సావిత్రితో చెప్పాడు ఇల్లుదొరికిందని. సావిత్రి మొహం వికసించింది. కాని అంతలోనే ఆమెకి ఒకవిధమైన భయంకూడా ఆవరించింది. ఆ యింటి యజ యజమాని యెలాంటివాడో, ఆ వాతావరణం యెలా వుంటుందో, యిరుగు పొరుగువాళ్ళు తనని యేవిధంగా చూస్తారోనన్న బెదురు పట్టుకుంది.

"ఇంతకీ యెవరింటికండీ!" అంది.

"మా స్నేహితుడి యిల్లేలే, ఫరవాలేదు. వాడు చాలా మంచివాడు. వాళ్ళమ్మ కూడా యెంతో ఉత్తము రాలు. నువ్వేమీ భయపడకు....పదపోదాం ..."అన్నాడు.

సావిత్రి యింకేమీ అనలేకపోయింది. 'తన తెలివి తక్కువగాని, యివన్నీ ఆలోచించి చేయగలిగిందేవిఁటి? ఎక్కడికో ఒక దగ్గరికి వెళ్ళి వుండాల్సిందే! వెయిటింగ్ రూమ్‌లో యెన్నాళ్ళు వుంటుంది? ఈ రోజు కాకపోతే రేపైనా వెయిటింగ్‌రూమ్ విడిచి పెట్టాలి' అనుకుని తనలో తాను సమాధానపడింది.

"పదండయితే!" అంటూ తనో సూట్‌కేసు పట్టుకుని ఆయనకోటి అందించింది.

భానుమూర్తి నడుస్తుంటే సావిత్రి అతణ్ణి అనుసరించింది.

## 9

జగన్నాథంకి విశాఖపట్నం బదిలీ అయింది. ఆ బదిలీ అనుకోకుండా జరగడం, అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ముఖ్యంగా సీత నిరుత్సాహం వర్ణనాతీతం. ఆమె ఆశలన్నీ పెనుతుఫానులో కూలిన చెట్లవలె, మట్టిగొట్టుకు పోయాయి. జగన్నాథంకి మాత్రం ఉత్సాహంగా వుంది.

విశాఖపట్నం జీవితం చాలా హాయిగా వుంటుందని చాలా మంది నోట విన్నాడు, అందుకే ఆ ఆనందం.

"బదిలీ తప్పించుకోడానికి వీల్లేదేవిటా!" అంది సీత. బదిలీ విషయం తెలిసిన రోజునే ఆమె గొంతు బొంగురు పోయింది.

"లాభం లేదక్కా, తప్పించుకోడానికి నేనూ ప్రయత్నించాను. కాని ఫలించ లేదు. పోనీ అక్కడ జీవితాన్ని కూడా చవిచూడవచ్చునుగా! మీ రెప్పుడైనా వస్తే నాలుగు రోజులపాటు వుండవచ్చు." నవ్వుతూ అన్నాడు జగన్నాథం.

సీత మొహం చీదరించుకుంది. "అయితే అక్కడికి కావాలనే బదిలీ చేయించుకున్నావన్నమాట" అంది కటువుగా.

జగన్నాథం తెల్లమొహం వేశాడు. అక్క అసూయకి కారణమేవిటో ఊహించుకోలేక సతమతమయ్యాడు.

"అబ్బే, నాకా అభిప్రాయమే లేదక్కా! నా మాట నమ్ము. బదిలీ అయ్యాక ఆ స్థలం యెలాంటిదైనా, యిష్టం లేకపోయినా యిష్టమున్నట్టే భావించుకోవాలి కదూ! లేకపోతే, మనం కోరినట్టుగా యెవరూ చెయ్యరు."

జగన్నాథం చెప్పడం యేదో అంతర్గతంగా బాధ పొందుతూవున్నట్టే చెప్పాడు. అందుకే సీత కోపం కాస్త

చల్లారింది. ఆమెలో యిప్పుడు అదో విధమైన బాధ స్థావరం ఏర్పర్చుకుంది.

"ఏవిఁటోరా! ఈ నాలుగైదు సంవత్సరాల్నించీ నువ్విక్కడ వుంటుండటం, మనం చిన్నప్పుడు కలిసి మెలిసి పెరిగినట్టే అన్పించింది. మళ్ళీ యిప్పుడు నువ్వు దూరమై పోతావంటే, యేవిఁటో అదోలా అనిపిస్తుంది." అంది నిర్లిప్తంగా.

"ఈ మాత్రందానికే బాధపడితే యెట్లా అక్కా! ఉద్యోగరీత్యా యెక్కడికి పంపితే అక్కడికి వెళ్ళాల్సిందే. ఉద్యోగ ధర్మమిది. ఎప్పుడూ ఒక్కదగ్గరే ఉద్యోగం చెయ్యాలంటే యెలా సాధ్యమౌతుంది?" అన్నాడుచిన్నగా మందహాసం చేస్తూ.

"నీ పెళ్ళి జరిగేవరకైనా యిక్కడుంటావనీ, మా సరస్వతి మా యింట్లోనే అడుగుపెడుతుందనీ యెంతో సంబర పడ్డానురా. కాని ఆ ఆనందం అనుభవించే అదృష్టం నాకు లేకపోయింది."

అక్క బాధేవిఁటో అర్థంచేసుకున్నాడు జగన్నాథం.

"ఇప్పుడు మాత్రం మించిపోయిందేవిఁటక్కా! మేమిద్దరం కొన్నాళ్ళపాటు యిక్కడే వుంటాంలే." నవ్వుతూ అన్నాడు జగన్నాథం.

"ఎలాగో సరిపెట్టుకుంటామనుకో. కాని యీ ఎడబాటు కొన్నాళ్ళవరకూ బాధ కలిగిస్తూనే వుంటుంది. అన్నట్టు నాన్నకి ఉత్తరం రాశానురా, దగ్గర్లోనేముహూర్తం

యేదైనా వుంటే నిశ్చయించమని. జవాబుకోసం యెదురు చూస్తున్నాను.

"ఇంతకీ మీ బావగారు యింకా మాటివ్వలేదు కదూ! అప్పుడే ముహూర్తం వరకూ వెళ్ళిపోతున్నా వేమిటి?" నవ్వుతూ అన్నాడు.

"ఇంక మాటివ్వడ మేమిటిరా. ఒప్పుకున్నట్టే. వాళ్ళకి యింతకంటె మంచి సంబంధం దొరుకుతుందా యేమిటి? నాన్నగారు యెలాగూ వెళ్తారుగా, యేదో తేలిపోతుంది" అంది సీత.

అనంతం అప్పుడే బయటనుంచి వచ్చాడు? "పిడికి బదిలీ అయిందటండీ!" అంది భర్తను ఉద్దేశించి సీత.

"ఔను, నేనూ విన్నాను. రామ్మూర్తిగారు త్రోవలో కలిసి అంతా చెప్పారు. అనుకోకుండా ఈ బదిలీలు వచ్చాయటగా. పోనీలే. విశాఖపట్నం మంచి స్థలమే. ఒకటే హోటలు భోజనం చవి చూడాలిమరి...." అన్నాడు.

"అదింకా యెన్నాళ్ళు లెండి. పెళ్ళయిపోయాక సరస్వతి వెళ్ళి వుంటుందిగా." అంది సీత.

"అదీ నిజమే అనుకో! అన్నట్టు మీ నాన్న దగ్గర నుంచి వుత్తరమేదైనా వచ్చిందా?" అన్నాడు అనంతం.

"రాలేదండి. మనం యెదురు చూస్తున్న ఉత్తరాలు యెప్పుడూ ఒకంతటరావుగాని, తతిమ్మావి వస్తాయి...."

"ఇంకెవరైనా రాశారా?"

"మీ అన్నగారు రాశారు ..."

"ఏమిటి రాశారు?" ఆసక్తి చూపాడు అనంతం.

"ఏముంది? ఎప్పుడూ వున్న సోదేగా. వాళ్ళ బావ మరిది జాడ యింక తెలీలేదుట. వాళ్ళ అత్తగారు బెంగ పెట్టుకున్నారట...." వెటకారం ధ్వనించేట్టు అంది. కాని అనంతం ఆ వెటకారాన్ని అర్థంచేసుకోలేకపోయాడు. "పాపం! యీ వృద్ధాప్యంలో ఆమెకీ మనోవేదనపట్టుకుంది. అతడయితే యెక్కడో హాయిగా వున్నాడు. ఇప్పటి పిల్లలే అంత" సానుభూతి చూపించాడు అనంతం.

సీతకు వళ్ళు మండిపోయింది. "పాపం మీరు బాధ పడుతున్నారు....ఓసారి వెళ్ళి వెదికి రాకూడదూ!" ఆటం బాంబులా గర్జించింది సీత. అనంతం అదిరిపడ్డాడు. సీత మాత్రం ఆగలేదు. "ఏం సానుభూతి! ఏం సానుభూతి! పిల్లల్ని బాగా ముద్దుచేసి గారాబంగా పెంచడమూను, వాళ్ళు పెద్దయ్యాక అప్రాచ్యపు పనులేవైనా చేస్తే, హారి భగవంతుడుడా అని అల్లాడ్డమూనూ! ఇది మనవాళ్ళకి అల వాటేగా. అయినా నాకు తెలీక అడుగుతాను. అతని జాడ యెలా తెలుస్తుందండీ! యేదో న్యూస్ పేపరులో ప్రకటిస్తే కాదూ. ఊఁహూఁ! అలా చెయ్యడానికి నామోషిగా. సంఘ గౌరవం పోతుందని భయం" హస్త విన్యాసం చేస్తూ అంది సీత.

అనంతం నోరు అప్రయత్నంగా కట్టుబడిపోయింది. యెదురు ప్రశ్నవేస్తే తన మర్యాద దక్కదని అతనికి తెలుసు. సీత మాత్రం వూరుకోలేదు.

"అతడింకా వస్తాడని నాకు నమ్మకం లేదు. ఏ మొహం పెట్టుకుని వస్తాడు? తన మర్యాదా, తనవారి మర్యాదా మంటగలిపింది యింక చాలదూ? వస్తేమాత్రం నలుగుర్లో మొహమెత్తుకు తిరగ్గలిగే ధైర్యమెక్కడుం టుంది? అందుకే యెక్కడో వుద్యోగం చేసుకుని బ్రతుకు తున్నాడేమో!" అంది కసిగా.

అనంతం కిక్కురు మనలేదు గాని జగన్నాథం మాత్రం వూరుకోలేదు.

"నేనయితే యెవరికీ భయపడను సుమా! పరిస్థితులు అనుకూలించక పలాయనమై మనసులు కలిసి పెళ్ళిచేసుకుంటే తప్పేవిటి? పెళ్ళయ్యాక యెవరైనా చేసే దేముంది? అతను యెందుకు తిరిగిరాలేదో బోధపడకుండా వుంది. కేవలం సంఘానికి వెరచి రాలేదేమో! కొద్దిగా పిరికివాడిలా వున్నాడు" అన్నాడు వుద్రేకంతో.

తమ్ముడి మాటలు సీతకి రుచించలేదు. మొహం చిట్లించుకుంది. అనంతం మాత్రం చిన్నగా నవ్వి శారవమరిది వేపు చూశాడు.

భానుమూర్తి నారాయణతో పాటు హెడ్ గుమాస్తాగారింటికి వెళ్ళాడు. ప్రార్థేయపూర్వకంగా అంతా చెప్పాడు. తను యే పరిస్థితుల్లో యిల్లు వాటాడో యెలాంటి బలహీనతకి తను లొంగిపోయాడో చెప్పాడు. అంతవరకూ భానుమూర్తిపై దురభిప్రాయాన్ని కలిగివున్న హెడ్ గుమాస్తా మనసుమార్చుకుని, "ఆ వయస్సు అలాంటి దనుకో! అయినా కనీసం శలవు దరఖాస్తయినా పంపి

వుండాల్సిందిగా" అన్నాడు హెడ్‌గుమస్తా.

"అక్కడే పొరపాటు జరిగింది సార్!" సవినయంగా అన్నాడు భానుమూర్తి.

"సరే! ఓ సిక్ సర్టిఫికేటు సంపాదించి తీసుకురా! తతిమ్మాదంతా నేను చూసుకుంటాను" అన్నాడు.

అలాగేనంటూ కృతజ్ఞతా భావాన్ని కళ్ళల్లో వెద జల్లుతూ తిరుగుముఖంపట్టాడు భానుమూర్తి నారాయణతో పాటు.

హెడ్‌గుమస్తా చెప్పినరీతిగానే అంతా చేశాడు భానుమూర్తి. ఎలాగయితేనేం వుద్యోగంలో చేరాడు మళ్ళీ.

ఓ రోజు మధ్యాహ్నంవేళ వడగాడ్పు వీస్తుంటే, సావిత్రి తలుపురెక్కలు దగ్గరికి చేరవేసి చాపమీద్ద నడుం వాల్చింది. పార్వతమ్మ బయటనుంచి పిలిచింది. సావిత్రి వడిగా లేచివెళ్ళి తలుపుతీసింది.

"పడుకున్నావేంటమ్మాయ్?" అంది పార్వతమ్మ.

"లేదు పిన్నిగారూ! రండిలోపలికి" అంటూ ఆహ్వానించింది.

ఇద్దరూ చాపమీద కూచున్నారు. పార్వతమ్మ ఆ యింట్లోకి రావడం యిదే మొదటిసారి కాకపోయినా, తీరిగ్గా కూచోడానికి రావడం యిదే మొదటిసారి. ఇల్లంతా ఓసారి పరికించి చూసింది.

"గోడలు బోసిగా అగుపిస్తున్నాయి. [illegible]

క్యాలెండర్లన్నా తెచ్చి తగిలించమ్మాయ్, మా యింట్లోవి యిస్తాను" అంది.

"అలాగేనండీ!" అంది నెమ్మదిగా. "నీకు యీ యిల్లు నచ్చిందా?" ప్రశ్నించింది పార్వతమ్మ.

"నచ్చుబడికి అంతు యెక్కడుంది పిన్నిగారూ? ఎక్కడకక్కడే సర్దుకుపోవాలి. అయినా యీ యింటకేం! సామాన్యులకు కావల్సిన అన్నిసదుపాయాలూ వున్నాయి. అధునాతన బంగళాల్లోలా చదువుకోడానికో గదీ, పడుకుందుకో గదీ, వంటకోగదీ, నలుగురూ కూచుని మాట్లాడుకుందుకో గదీ, యిన్నిగదులు కావాలంటే యెక్కణ్ణించి వస్తాయి?" అని నవ్వుతూ అంటూ "ఇంటిలో యేముంది పిన్నిగారూ! మీలాంటి ఉత్తమ వ్యక్తుల మధ్య వుంటే ఇదేచాలు. అదే ఓ స్వర్గం. నిజంగా నేను చాలా అదృష్టవంతురాల్ని ... " అంది.

సావిత్రి మాట్లాడే విధానానికి మురిసిపోయింది పార్వతమ్మ. లోలోన గర్వంగా నవ్వుకుంది. సావిత్రిపైగల అభిమానం మరింత హెచ్చింది.

"ఆ! దానికేముందిలే అమ్మాయ్ ... అమ్మాయ్ .... అన్నట్టు నువ్వు వచ్చినట్టు మీవాళ్ళకి కబురు పంపావా?" అంది పార్వతమ్మ.

అప్రయత్నంగా సావిత్రి కుంచించుకు పోయింది. అవమానంతో. ఎందుకి అనుభూతిని పొందిందో ఆమెకే

అనూహ్యమయింది. 'తను యేం జవాబు చెప్పాలి? తను యెట్లా కబురు పంపుతుందన్న యింగితం పార్వతమ్మకి యెందుకు లేకపోయింది?' అనుకుని బాధపడింది.

"లేదు పిన్నిగారూ! కబురు పంపమని ఆయనతో చెప్పాను." అబద్ధం చెప్పింది. పార్వతమ్మ ఆమె కళ్ళల్లోకి చూసింది. ఆ లేత కళ్ళల్లో అశ్రువులు దోబూచులాడుతున్నాయి.

"ఏమిటమ్మాయ్, కన్నీరు పెట్టుకుంటున్నావు?" గాభరాగా అంది పార్వతమ్మ.

సావిత్రిలో అణగివున్న దుఃఖం, ఒక్కసారి పెల్లుబికింది. ప్రవాహం ఆనకట్ట కొట్టుకుని ప్రవహించినట్టుగా, కన్నీరు చెక్కిళ్ళపైకి జాలు వారింది.

"నా బ్రతుకు వ్యర్థమైపోయింది పిన్నిగారూ! ఎంత ముద్దుగా పెరిగానో, యెంత గారాబంగా యింట్లో తిరిగానో, యిప్పుడంత వ్యథ ననుభవిస్తున్నాను. క్షణికావేశంలో భవిష్యత్తును వూహించలేక, చేసిన ఒకే ఒక్క తప్పుకి ప్రాయశ్చిత్తం ఇప్పుడనుభవిస్తున్నాను. నన్ను చూడడానికి మా వాళ్ళెవరూ రారు. వాళ్ళు నన్ను క్షమించరు. ఎప్పటికీ క్షమించరు. నేనిలా బాధతో, వ్యథతో కృశించిపోవాల్సిందే! ఇన్నాళ్ళుగా అంతరాళంలో అణచిపెట్టుకున్న వ్యథని వెళ్ళగక్కకుండా వుండలేక పోతున్నాను పిన్నిగారూ ముందు...." అంటూ రెండు చేతుల్తో ముఖాన్ని కప్పుకుని ఏడ్చింది సావిత్రి.

పార్వతమ్మ గుండె చెరువయింది. సావిత్రి పడుతున్న శోకంతా తనే అనుభవిస్తున్నట్టుగా కన్నీరు. పెట్టుకుని చీరచెంగుతో ఒత్తుకుంది. కన్నతల్లిలా సావిత్రిని దగ్గరకు తీసుకుంది.

"మరేమీ బాధపడకమ్మా! జరిగిపోయిన దానికై విచారించడం మరింత తెలివితక్కువ. ఎంతటి వివేకవంతులైనా, మంచివాళ్ళయినా సరే, కర్మానుసారంగా ఒక్కొక్కప్పుడు గోతిలోపడి విధి నిర్ణయాన్ని అనుభవించక తప్పదు. ఏం చేస్తాం? పరిస్థితుల్ని యెదిరించి ముందుకు సాగిపోవడమే ప్రస్తుత కర్తవ్యం. నువ్వేమీ దిగజారిపోకు. మీ నాన్నగారు రాకపోయినా, మీ అమ్మ తప్పక నిన్ను చూడ్డానికి వస్తుందమ్మా! మాతృహృదయంలోని మమత నీకు తెలీదు. మరి అబ్బాయి వాళ్ళమ్మకైనా తెలియజేశాడా? వాళ్ళీమధ్య మీకోసం గాలిస్తున్నారటగా!" ఓదార్చడానికి ప్రయత్నించింది పార్వతమ్మ.

"పోరుపెట్టగా, పెట్టగా మొన్నను రాశారుటండీ." రుద్ధకంఠంతో అంది సావిత్రి. "అయితే ఆవిడ తప్పకుండా వస్తుంది. ఎంతయినా కన్నకడుపాయె." అంది పార్వతమ్మ.

బైట రిక్షా ఆగిన చప్పుడయింది, "ఎవరో వచ్చినట్టుంది." అంటూ వెలుపలికి వచ్చింది పార్వతమ్మ. ఆ వచ్చిన వ్యక్తిని గుర్తుపట్టలేక పోయింది. సావిత్రి కాస్త ముందుకివచ్చి చూసి కర్రిగట్టి పోయింది. వచ్చినవ్యక్తి యింకెవరో కాదు. భానుమూర్తి తల్లి యశోదమ్మ.

సావిత్రికి మొహం గిర్రున తిరుగుతున్నట్టయింది. లోపలికి వచ్చేసి చాపమీద కూలబడింది. ఆపాదమస్తకం వణికి పోతోంది.

పార్వతమ్మ, యెప్పుడూ యశోదమ్మను ముఖతః చూళ్ళేదు. అందుకే ఆమెవేపు వింతగా చూస్తోంది.

యశోదమ్మ రిక్షావాడికి డబ్బులిచ్చేసి సూట్ కేసు చేత్తో పట్టుకుని - అరుగుమీదకివస్తూ, యెదురుగావున్న పార్వతమ్మని వుద్దేశించి "పార్వతమ్మగారిల్లు యిదేనాండి?" అంది.

పార్వతమ్మ మరింత ఆశ్చర్యపోయింది.

తనకి తెలీనివాళ్ళు తనయిల్లు వెతుక్కు రావడ మెందుకో, అనుకుంది. "ఔనమ్మా యిదే, నేనే పార్వతమ్మను." అంది చిరునవ్వుతో.

యశోదమ్మ తృప్తిగా గుటకవేసింది. "ఇక్కడ భానుమూర్తి వుంటున్నాడట కదండీ!" అంది.

పార్వతమ్మకి అంతా యిప్పుడర్థమయ్యింది. ఈమె భానుమూర్తి తల్లిగారై వుంటుందని పసిగట్టడానికి యెంతో కాలం పట్టలేదు. మందహాసం చేసింది.

"ఔనమ్మా! యిదిగో, ఈగదిలోనే వుంటున్నారు. రండి...." అంటూ గదిలోకి త్రోవతీసింది.

సావిత్రి పరిస్థితి వర్ణనాతీతం. వణికిపోతోంది. అత్తయ్యను యెలా పలకరించాలో, యేం చెయ్యాలో,

ఆమె కోపగించుకుంటే, అసహ్యించుకుంటే తను యెట్లా సహించాలో అన్న సందిగ్ధావస్థ, లేచి నుంచుంది.

పార్వతమ్మ వెంటవచ్చింది యశోదమ్మ. సావిత్రికి యింకేమీ తోచలేదు. యశోదమ్మ కాళ్ళముందు కూలబడి, ఆమె పాదాల్ని ముట్టుకుంటూ "నన్ను క్షమించండత్తయ్యా" అంది రుద్ధకంఠంతో. ఆ క్షణంలో ఆమె అంతరాళంలో యెంతగా బాధపడుతుందో, యెట్లాంటి మానసిక సంక్షోభానికి గురి అయ్యిందో, ఆమె కళ్ళవెంబడి స్రవించి, యశోదమ్మ పాదాల్ని ప్రక్షాళనచేస్తున్న ఆ కన్నీరే సాక్షి.

తన కొడుకును మురిపించి, మైమరపించి, వంచించి, వలలో వేసుకున్న సావిత్రిని అసహ్యించుకుని, చీవాట్లు పెట్టాలన్న దృఢనిశ్చయంతో వచ్చిన యశోదమ్మ నోరెత్తలేక పోయింది. ఆమెలో వుద్రేకం చల్లబడింది. ఏమిటో చెప్పలేని ఓ విచిత్రమైన సానుభూతికి లోనయ్యింది.

"లే అమ్మా లే ... యేంచేస్తాం? ఎవరెవరు చేసుకున్న పాప పుణ్యాల ఫలితాన్ని వారు అనుభవించాల్సిందే." అంది కంటతడి పెట్టుకుంటూ, సావిత్రిని ఓ చేత్తో లేవదీసి. సావిత్రికి అప్పుడుగాని మనసు కుదుట పడలేదు. యశోదమ్మ చాలా మంచిమనిషన్న నిశ్చయానికి వచ్చింది. ఆమెలో యెక్కడలేని ధైర్యం పుంజుకుంది. అసలు వ్యక్తే తనని క్షమించింది. ఇకను యెవరేమన్నా తను లక్ష్యం చేయనవసరం లేదనుకుంది. లేచి అత్తయ్య చేతిలోవున్న సూట్ కేసు అందుకుని ఓమూల పెట్టింది.

అంతా కళ్ళారా చూస్తున్న పార్వతమ్మ తృప్తిగా నవ్వుకుంది.

"మీ అత్తగారు స్నానం చేస్తారేమో, నీళ్ళతోడు సావిత్రీ" అంది పార్వతమ్మ.

"అబ్బే! యిప్పుడేమీ వద్దు..." అంది యశోదమ్మ.

"పోనీ భోంచేయండి. వంటచేస్తాను" అంది సావిత్రి వెనక్కి తిరుగుతూ.

"భోజనం చేసే వచ్చానమ్మాయ్... మరిప్పుడేమీ వద్దు. అబ్బాయేడీ?"

"ఆఫీసుకి వెళ్ళారత్తయ్యా!" అంది సావిత్రి.

"అలా నిల్చుండి పోయారేమండీ? కూచోండి..." అంది పార్వతమ్మ. యశోదమ్మ చాపమీద కూచుంది. పార్వతమ్మకూడా కూచుంది.

పార్వతమ్మ, సావిత్రి గుణగణాల్ని మెచ్చుకుంటూ కాస్సేపు మాట్లాడింది. 'ఆ దంపతులు ఆనందంగా కాలం గడుపుతున్నారు. యింక అంతకంటే కావల్సిందేవిటి? ....' అన్న ప్రస్తావనకూడా సాగించింది. యశోదమ్మ అన్నింటికి వూం కొడుతూ వచ్చింది. కాస్సేపు పోయాక పార్వతమ్మ వెళ్ళిపోయింది.

సావిత్రి తలగడ ఒకటి తెచ్చియిస్తూ "మీరు నిద్రపోండి అత్తయ్యా!" అంది.

ప్రయాణ బడలిక తీరడంకోసం యశోదమ్మ చాల బడింది కాస్సేపు. నిద్రలేచాక కోడలు తయారుచేసిన

కాఫీ తాగి, కొడుకు రాకకోసం ఆసక్తితో యెదురు చూస్తోంది.

సాయంత్రం అయిదు గంటలకి భానుమూర్తి వచ్చాడు. తల్లిని చూస్తూనే నీరైపోయాడు. చప్పున మాట్లాడలేని స్థితికి వచ్చేశాడు.

"ఏవమ్మా! ఎప్పుడొచ్చావు?" అన్నాడు మొహం ప్రక్కకు తిప్పుకుని.

అత్తయ్య తప్పకుండా ఆయన్ని చీవాట్లు పెడుతుం దనీ. యేవేవో మాటలంటుందనీ మొదట అనుకుంది సావిత్రి. కాని, అట్లాంటిదేమీ జరక్కపోయేసరికి, ఆమె మనసు ఆనందంతో నిండింది. అసలే కొడుకంటే ప్రాణం యశోదమ్మకి. ఎంతో గారాబంగా, ముద్దుగా పెంచింది. అలాంటివాడు పలాయనమై, మళ్ళీ యిన్నాళ్ళకి తిరిగి వచ్చాక, ఆమె యెంతగా ఆనందిస్తుండాలి! ఆ గారాబం, ఆ మమతే ఆమె మనసుని మార్చేశాయి. ఆ సంగతి సావిత్రికి యేం తెలుసు?

"మధ్యాహ్నం వచ్చాన్రా! నువ్వేవిటి యిలా చిక్కిపోయావు? అయినా భానూ, నువ్విలాంటి అప్రాచ్యపు పని చేస్తావని నే నెప్పుడూ అనుకోలేదురా! మా అంతస్థు యిప్పుడు సంఘంలో యెక్కడుందో కాస్త పరికించిచూడు. మీరూ, మీతోపాటు నేనూ నలుగుర్లో మొహమెత్తుకుని తిరగలేకపోతున్నాం. మీ నాన్నగారు బ్రతికున్న రోజుల్లో యెంత గౌరవంగా బ్రతికాం.... నువ్విప్పుడు కాస్త ఆ గౌర

వాన్ని తుడిచిపారేశావు. అసలు, నీకీ పాడుబుద్ధి యెలా పుట్టిందిరా! ఆ అమ్మాయి తొందరపడితే నీకైనా బుద్ధి వుండక్కర్లేదూ? పోనీ, నీకు ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకో వాలన్న అభిప్రాయం వుందనుకో! ఆ సంగతే నాతో చెబితే, నేను కాదంటానా! సలక్షణంగా అగ్నిసాక్షిగా పెళ్ళాడి వుందువే!" అంది యశోదమ్మ అదో విధమైన అసహ్యంతో.

భానుమూర్తి మొహం దించుకున్నాడు. కాస్త దూరంలో నుంచుని వింటున్న సావిత్రి లోపలికి పోయింది పాలిపోయిన ముఖంతో.

"నన్ను క్షమించమ్మా! చేసినది తప్పే! ఇప్పుడనుకుంటేమాత్రం ప్రయోజనమేముంది? ఆ క్షణంలో ఆ దౌర్బల్యానికి లొంగిపోయాను...." అన్నాడు బాధగా.

యశోదమ్మకి కొడుకుమీద కోపానికి బదులుగా జాలిపుట్టింది. వాడంత మంచిగా తన తప్పిదాన్ని ఒప్పుకుంటుంటే, తను కోపగించుకుని నిలదీసి అడగడంలో అర్థం లేదనుకుంది. మరేమీ మాట్లాడలేదు.

"బావ, అక్క, సరస్వతి అంతా బాగున్నారా అమ్మా?" అన్నాడు.

"ఆ! బాగున్నార్రా. మీ అక్క వస్తానని బయలుదేరింది కాని, బావ వంట్లో సుస్తీచేస్తేనూ వుండిపోయింది. మిమ్మల్నిద్దర్నీ తీసుకురమ్మని మరీ మరీ చెప్పింది" అంది యశోదమ్మ.

భానుమూర్తి యింకేమీ జవాబివ్వకుండా లోపలికి నడిచాడు. వెళ్ళడమా మానడమా, అన్న సందిగ్ధంలోపడి ఆలోచించుకుంటూ, కొడుకుని చాలారోజుల తర్వాత కళ్ళారా చూశానుకదా అన్న ఆనందంతో నిండుగా నవ్వుకుంది లోలోన యశోదమ్మ....

## 10

రామానుజం భార్య రాజరత్నం ఓ రోజు మధ్యాహ్నం తులశమ్మగారింటికి వెళ్ళింది. సీతారామయ్య యింట్లో లేడు. తులశమ్మ చాపవేసి ఆహ్వానించింది. కాస్సేపు ఆమాటా, యీమాటా మాట్లాడుకొన్న తర్వాత "మీ అమ్మాయి వచ్చేసిందటకదండీ ఊళ్ళోకి" అంది రాజరత్నం.

ఆకస్మాత్తుగా ఆ కబురు వినడంవల్ల తృళ్ళిపడింది తులశమ్మ.

"నిజంగానా ఎప్పుడు వచ్చింది? ఎవరు చూశారు" ఆసక్తితో ప్రశ్న పరంపరలు వేసింది.

"మా ఆయన చెప్పారు. వచ్చి వారం రోజులయిందట.... చెంగలరావుపేటలో వుంటున్నారట. భానుమూర్తి నిన్ననే ఈయనికి అగుపించాడట...." అంది రాజరత్నం.

తులశమ్మ హృదయం సంతోషంతో నిండింది. కూతుర్ని మళ్ళీ చూడగలుగుతున్నందుకు ఆమె మురిసిపోయింది. వారంరోజులైె వచ్చినా కూతురు కబురు పంపనందుకు కాస్త బాధపడింది. ఆమె కళ్ళల్లో నీరు గిర్రునతిరిగింది. అవి ఆనందబాష్పాలో, అశ్రుధారలో చెప్పలేం.

"నాకు తెలీనే తెలీదమ్మా. వాళ్ళ వునికి కాస్త మీ ఆయనన్నడిగి తెలుసుకుంటూ!"

"అలాగే అడిగి చెప్తాను...."

"అమ్మాయిని చూడాలని తహ తహగా వుంది. ఎలా వుందో యేమిటో యిప్పుడు!" అంది బాధగా తులశమ్మ.

"బాగానే వుంటుంది.... మీరేం బాధపడకండి...." ఓదార్చినట్టు అంది రాజరత్నం.

"అమ్మాయి మళ్ళీ నా కళ్ళెదుటికి వచ్చింది.... అంతేచాలు. చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత. పూర్వ జన్మంలో అదేం పాపం చేసుకుందో, యిట్లా ప్రవర్తించింది? లేకపోతే, దాని వివాహం యెంత వైభవంగా జరపాలనుకున్నాం? వాళ్ళ నాన్న పెద్ద సంబంధమే చూశారు. ఇంతకీ దానికా రాత లేదు" అంది నిట్టూరుస్తూ తులశమ్మ.

"ప్చ! అంతేనమ్మా అంతే మనం అనుకోవడమే గాని, జరగాలని వున్నది యెలాగూ జరుగుతుంది. మన తృప్తికోసం ప్రయత్నాలు చేస్తామంతే! మరి నే వెళ్ళొస్తానండీ!" అంది రాజరత్నం.

"కాస్త మజ్జిగ పుచ్చుకుని వెళ్దువుగాని వుండమ్మా" అంటూ వంటగదిలోకి వెళ్ళి గ్లాసునిండా మజ్జిగపోసి తెచ్చిచ్చింది, తనకి శుభవార్త అందించినందుకు ప్రతిఫలంగా గామోసు.

రాజరత్నం గ్లాసు ఖాళీచేసి వెళ్ళిపోయింది. సీతా రామయ్య యింటికి వచ్చాడు. దుస్తులు మార్చి కాఫీ సేవించాడు. ఖాళీగ్లాసు అందుకుని. "మీరు విన్నారా?" అంది తులశమ్మ నెమ్మదిగా, ఓపిక్క బెదురుతూనే.

"ఏమిటి?" గంభీరంగా అన్నాడు సీతారామయ్య.

"అమ్మాయి వూళ్ళోకి వచ్చిందట...."

సీతారామయ్య తోక తొక్కిన త్రాచులా ఛర్రున లేచాడు అతని ముఖకవళికలు ఆకస్మాత్తుగా మారి పోయాయి. "నా పరువు ఏనాడో మంటగలిపింది. మళ్ళీ ఎందుకు తిరిగివచ్చింది? ఇంక యేం చెయ్యాలని? సిగ్గూ, యెగ్గూ లేకుండా రాకపోతే అక్కడ చావకపోయిందా" అన్నాడు ఉద్రేకంగా సీతారామయ్య.

తులశమ్మ నిర్ఘాంతపోయింది. "అవేం మాటలండీ! కూతుర్ని యెవరన్నా అలా అంటారా? ఏదో తెలిసీ తెలియని జ్ఞానంలో తప్పు చేసిందే అనుకోండి. మనం కూడా అందరిలా ఆడిపోసుకుంటే యెలా?" అంది తులశమ్మ ప్రాధేయపడుతున్న ధోరణిలో.

"ఇంటి 'నిప్పు' అని వడిలో పోసుకుంటే కాలకుండా వుంటుందా యేమిటి? తప్పు చేసిందిగాబట్టే శిక్ష అనుభ విస్తోంది. అది నా కూతురుకాదు. నా కూతురు యేనాడో చనిపోయిందని నిర్ణయించుకొన్నాను. నాకా విషయం చెప్పకు."

తులశమ్మ మనస్సు చివుక్కుమంది. "మీ లాంటి కటిక హృదయుల్ని నే నెక్కడా చూళ్ళేదండీ! ఓ సారి వెళ్ళి చూస్తే కాదూ!" అంది.

"నోరు మూసుకో! సిగ్గువిడిచి ఇంక నన్ను దాన్ని చూసి రమ్మంటావా! చస్తే దాని మొహం చూడను ..." గర్జించాడు సీతారామయ్య.

తులశమ్మలో సహనం తగ్గుముఖం చూపింది. 'తను ఇంత ప్రాధేయపడుతున్నా .... ఆయన మారడంలేదే' అన్న బాధతో పాటు రోషం, ఆత్మాభిమానం తలెత్తాయి. మగవాళ్ళెప్పుడూ కఠినాత్ములే అని మనసులో తిట్టుకుంది.

"మీర్రు వెళ్ళకపోతే పోయి నేను మాత్రం చూడ కుండా ఉండలేను ...." అంది చొరవచేసి.

సీతారామయ్య కళ్ళు ఆశ్చర్యంతో, క్రోధంతో పెద్దవయ్యాయి. 'ఏనాడూ తనకి యెదురుచెప్పని భార్యేనా అలా అంటున్నది'? అనుకున్నాడు.

"వీల్లేదు .. నువ్వు కూడా వెళ్ళడానికి వీల్లేదు" ఆజ్ఞాపించాడు సీతారామయ్య గంభీరంగా.

తులశమ్మకి భర్త ప్రవర్తన అసహ్యం కలిగించింది. అయినా యేంచేస్తుంది? "ఏ విషయంలోనూ యింతవరకూ మీ ఆజ్ఞ జవదాటలేదు. యిప్పుడు మాత్రం మీరే నాకా అవసరం బలవంతంగా కలిగిస్తున్నారు. మీరు యేమన్నా సరే, నన్నేంచేసినాసరే వెళ్ళి దాన్ని చూడకుండా వుండ

లేను. ఎంతయినా అది నాకూతురు ..."రుద్రకంఠంతో అంది తులశమ్మ ఉద్రేకాన్ని అణగద్రొక్కుకుంటూ.

సీతారామయ్య భార్యమొహంలోకి విస్తుపోయి చూశాడు. అతనిలోకూడా పౌరుషం ప్రజ్వరిల్లింది. భర్తనన్న ఆధిక్యత కుదిలింది మెదడులో.

"నీకు అంత పట్టుదలవుంటే వెళ్ళు, నాకేమీ అభ్యంతరం లేదు. కాని, మళ్ళీ నువ్వు నా యిల్లు తొక్కడానికి వీల్లేదు. నీ కూతురుదగ్గరే కాపరం పెట్టు...." అన్నాడు కటువుగా.

తులశమ్మకు షాక్ తిన్నట్టయింది. ఏంచెయ్యాలో ఆమెకి పాలుపోలేదు. కాని అభిమానమన్నది ఓపక్క రెచ్చగొడుతూనే వుంది.

"అలాగేకానీయండి....మీ యింటిగడప తొక్కను, కాని నాకు మావాళ్ళు యిచ్చిన ఆ అయిదువేలు ఇటు పడేయండి. ఆ డబ్బు లేకపోతే యీ వ్యాపారంలోకి దిగేవారు కాదేమో;" అంది పరుషంగా.

స్త్రీలో సంచలనం చెలరేగితే మగవాడు ధైర్యంగా ఆమె యెదుట నిలబడగలడా అన్న సంశయం పుట్టిన సీతారామయ్యకి భార్య మాటలు విన్నాక నివ్వెరపాటు జనించింది. తనిప్పుడా డబ్బు యిచ్చేస్తే యెట్లా? అయినా, యీ చిన్న విషయానికి తను యింతగా తొందరపడ్డం బాగులేదేమో! చూడ్డానికి వెళ్తానంటోంది. వెళ్ళనీ ...అవి మన

సులో సమాధానపడ్డాడు. "ఏవిటి తులసీ నువ్వు అంటు న్నది? ఎప్పుడూ లేనిది యెందుకలా రెచ్చిపోయావు" అన్నాడు కాస్త దారికి వచ్చినట్టు.

తులశమ్మ కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాయి. తనుకూడా యెందుకలా ఆవేశపడిందో ఆమెకే అర్థంకాలేదు. 'ఈ వయ స్సులో విడిపోయే పరిస్థితే యేర్పడితే తన జీవితం యేం కావాలి! నలుగురిలో యెంత అగౌరవం?' అనుకుని బాధ పడిది.ం "మీరే తొందరపడ్డారు...." బావురుమంది తులశమ్మ.

"సరేలే! అమ్మాయిని చూడ్డానికి వెళ్తానంటున్నా వుగా. వెళ్ళు." అన్నాడు చివరికి తనే ఓడిపోయినట్టే నిరుత్సాహంతో.

తులశమ్మ హృదయం ఆనందంతో పూగిసలాడింది. భర్తలో ఆపాటి మార్పు రావడం తన అదృష్టమే ననుకుంది. "మరి మీరు రారుటండీ!" అంది.

"నేను రాను" అని ఖచ్చితంగా చెప్పలేకపోయాడు సీతారామయ్య. క్షణం క్రితమే 'చచ్చినా దాని మొహం చూడను' అని గర్జించిన వ్యక్తే, యిప్పుడా మాట అనలేక పోయాడు. అతనిలో ఒక విధమైన బలహీనత యేర్పడింది. "తర్వాత వెళ్తాలే!" అనేశాడు అయిష్టంగా.

తులశమ్మ తృప్తిగా నవ్వుకుంది. "బైటికి అలా అంటారేగాని, అంతరాళంలో మీకు మాత్రం కూతురంటే అభిమానం, ఆత్మీయతా లేవా ఏవిటి?" అనేసి లోపలికి పోయింది తులశమ్మ. కూతురు దగ్గరికి ఎప్పుడు వెళ్ళడమా అన్న ఆలోచన సాగిస్తూ.

సీతారామయ్య విసుగ్గా, వుడుకుమోత్తనంతో కుర్చీలో చేరబడిపోయాడు.

* * *

రాజరత్నం భర్త నడిగి తెలుసుకుని భానుమూర్తి ఉసికి చెప్పింది. తులశమ్మ బయలుదేరింది. రిక్షా సాగిపోతోంది. కూతుర్ని యెప్పుడు చూస్తానా అన్న ఆత్రుత, ఆసక్తితో తులశమ్మ హృదయం రిక్షాకంటే జోరుగా పరుగెత్తుతోంది రిక్షా పార్వతమ్మ యింటి దగ్గర ఆగింది. తులశమ్మ రిక్షావాడికి డబ్బులు యిచ్చేసి వస్తున్న సమయానికి సావిత్రి గదిలోపల్నుంచి వచ్చి, తల్లిని చూసి కళ్ళ నీరు తెచ్చుకుంటూ ఉద్వేగాన్ని ఆపుకోలేక "అమ్మా" అంటూ వచ్చి తల్లిమెడను రెండు చేతుల్తో పెనవేసింది. ఆమె కళ్ల నుండి జాలువారుతున్న అశ్రువులు తులశమ్మ మెడమీద వెచ్చగా పడుతుంటే, తులశమ్మ కళ్ళు నీళ్ళ పర్యంతమయ్యాయి. కూతురి తల నిమురుతూ "ఏవమ్మా, కులాసాగావున్నావా!" అంది రుద్ధకంఠంతో.

"కులాసాగానే వున్నానమ్మా. నువ్వొస్తావని రోజూ యెదురు చూస్తున్నాను. కానీ యెప్పటికీ రావు. నామీద కోపం తగ్గలేదేమోనని నిర్ధారణ చేసుకున్నాను. నాన్న రాలేదేమి?" అంది సావిత్రి.

ఏం చెప్తుంది తులశమ్మ? "తర్వాత వస్తానన్నారే!" అంది.... ఇద్దరూ ఇంటిలోపలికి నడిచారు.

ఈ సందడి పసిగట్టి పార్వతమ్మకూడా వచ్చింది. తల్లిని ఆమెకు పరిచయం చేసింది సావిత్రి. ముగ్గురూ చాప మీాద కూచున్నారు. తులశమ్మ గదిని ఓసారి పరిశీలనగా చూసి, "ఇదేవిఁటే! యింత చిన్న యింటో వుంటున్నారు?" అంది.

సావిత్రి నవ్వింది.

"ఇదైనా పార్వతమ్మపిన్ని దయవల్లనే దొరికిం దమ్మా! లేకపోతే యే సత్రంలోనో వుండేవాళ్లం...." అంది.

"కోరి కష్టాలు తెచ్చుకున్నావే! ఏంచేస్తాం? నువ్వు సుఖానికి నోచుకోలేదు...." అంది బాధగా తులశమ్మ.

"అలాగనకమ్మా! నేను సుఖంగానే వున్నాను...." అంది సావిత్రి.

"మీా ఆయన యేడీ?"

"ఆఫీసుకి వెళ్ళారు...."

"జానుకదూ, నా ప్రశ్న బావుంది. పోనీ నీతో అన్యోన్యంగా వుంటున్నాడా?" అంది మళ్ళీ.

సావిత్రి యేమని జవాబు చెప్తుంది? సిగ్గుతో మొహం దించుకుంది.

"పిల్లిద్దర్నీ చూస్తుంటే, చిలకా, గోరింకలు గుర్తుకొస్తాయి. అన్యోన్యత లేకపోవడ మేమిటమ్మా? నవ్వుతూ అంది పార్వతమ్మ.

తులశమ్మ సంతోషంతో మందహాసం చిందించింది పెదాలపై.

"మీ అత్తయ్య యింకా రాలేదేమిటి?"

"వచ్చిందమ్మా! ఎవరో తెలిసినవాళ్ళు యీ వీధి లోనే వుంటే వాళ్ళింటికి వెళ్ళింది .. కొద్దిసేపట్లో వస్తుంది" అంది సావిత్రి.

"వస్తానమ్మా కాస్త పనుంది" అంటూ వెళ్ళి పోయింది పార్వతమ్మ.

"లే అమ్మా, భోజనం చేద్దువుగాని" అంది సావిత్రి.

"నేను యింటికి వెళ్ళి భోజనం చేస్తాలేవే! నువ్వు భోంచెయ్యి."

"అలా కాదు, నువ్విక్కడే భోంచేయ్యాలి."

"పోనీ అలాగే కానీయ్ .... మీ అత్తగారు రానీయ్. మీ అత్తగారు యెలా ప్రవర్తిస్తున్నారు నీతో?" మెల్లగా అంది.

"ఆమెకి నేనంటే యెంతో అభిమానమమ్మా!" అంది వుత్సాహంగా సావిత్రి.

తులశమ్మ తృప్తిపడింది.

"ఇదిగో అమ్మా! యీ యిరవై రూపాయిలు నీ దగ్గరుంచు, అవసరానికి పనికివస్తాయ్" అంటూ చెంగున కట్టివుంచిన నోట్లు తీసియిచ్చింది.

"ఇప్పుడెందుకమ్మా?" అంది సావిత్రి అందు కుంటూనే. "ఎందుకేమిటే? డబ్బు అవసరం యెల్లాంటివాళ్ళ

కైనా, యెప్పుడూ వుంటుంది. ఇంటి ఖర్చులకు అవసరం లేకపోతే, యేమైనా సామానులు కొనుక్కో!''

సావిత్రి యింకేమీ అనలేదు. ఆడబ్బు తీసుకువెళ్ళి తనపెట్లో భద్రంగా దాచుకుంది.

యశోదమ్మ అప్పుడేవచ్చి తులశమ్మను చూసింది. ఇరువురి మనసుల్లో యేమే భావాలు వుద్భవించాయో తెలీదుగాని, క్షణం పోయాక అరమరలేకుండా, పాత స్నేహితుల్లా పలకరించుకున్నారు.

వియ్యపురాళ్ళ కలియక యే ప్రళయాన్ని తెస్తుందో నని భయపడిన సావిత్రి, తృప్తిగా నిట్టూర్పు విడిచింది.

"లేవండత్తయ్యా! మీరిద్దరూ భోజనం చేద్దురుగాని....'' అంటూ వంటగదివేపు నడిచింది సావిత్రి.

"లేవమ్మా తులశమ్మా, ఇలాగైనా మనం సన్నిహితులమవుత్యాం'' అంటూ నవ్వుతూ లేచింది యశోదమ్మ.

యశోదమ్మ విశాల హృదయాన్ని హర్షించుకుంటూ లేచింది తులశమ్మ. ఇద్దరూ ముసి ముసి నవ్వుల్తో ముందుకు సాగిపోయారు....

కొడుకునీ, కోడల్నీ, కూతురింటికి తీసుకు వెళ్ళాలని యశోదమ్మ భగీరథ ప్రయత్నం చేసింది. కాని, ఫలించ లేదు. సావిత్రికి వెళ్ళాలన్న కోరిక కాస్తంత అంతరం గంలోవున్నా, భానుమూర్తికి మాత్రం యిష్టంలేక పోయింది. వాళ్ళందరి యెదుటికి తానుగా పోవడానికి అతనికి మనస్కరించలేదు. అలాగని, సావిత్రికి ఓవేపు భయం లేదని కాదు. వుంది- కాని, ఆమెలో గాఢంగావున్న వాంఛ; వాళ్ళందర్నీ ఆత్మీయుల్ని చేసుకుని, వాళ్ళల్లో ఒకరుగా తనూ మెలగాలని. కాని, భర్త వద్దంటే తనేం చెయ్యగలదు?

తన రాకకోసం కాచుకుపూ, వాళ్ళు యెదురు చూస్తారన్న వుద్దేశంతో ఒంటరిగా వెళ్ళింది యశోదమ్మ. ఆమె వెళ్ళిపోతున్నపుడు మాత్రం కొడుకు, కోడలు రోక [illegible] తో చెప్పారు వేగిరం వచ్చేయమని. ఆ ఆప్యాయతకు లోలోన ఆనందించుకుంటూ అలాగే అంది యశోదమ్మ.

నరహరి పరిస్థితి ప్రశాంత వహింంగా యేర్పడింది. జగన్నాథం బుద్ధిమంతుడని అయిశేషం, ఆస్తివుందన్న విషయం ఆలోచించి అయితేనేం, తనకూతురు సరస్వతిని అతనికే యిచ్చి వివాహం చెయ్యాలని నిశ్చయించాడు. జగన్నాథం తండ్రికి మాట కూడా యిచ్చేశాడు.

కాని కమలకి యీ నిర్ణయం సుతరామూ ఇష్టం లేదు. మొదటినుంచీ, ఆమె తన పట్టుదలమీదే తిష్ఠ వేసింది. నరహరి భార్య మాటకి వీసమెత్తయినా విలు వివ్వకుండా నిర్ణయించేశాడు. అసలు, భార్యమాటమీద నడిచే ఘటంకూడా కాదాయె. ఈ నిర్ణయం జరిగిం దగ్గర నుంచి కమల భర్తతో ముభావంగా ప్రవర్తిస్తోంది. ఒక్కొక్కప్పుడు చీదరించుకోవడంకూడా కద్దు.

రాత్రి భోజనాలు ముగిశాక నరహరి వాలుకుర్చీలో కూచుని భార్య అందిస్తున్న తాంబూలం తీసుకొని నోట్లో వేసుకుంటున్నాడు. యశోదమ్మ కొడుకు సంగతులు చెప్తోంది. అవన్నీ విన్నాక "పోనీ, యేదో లక్షణంగా వాళ్లి ద్దరూ కాపురం చెయ్యటమే కావాలి" అన్నాడు. యశో దమ్మ తృప్తిగా చిరునవ్వు నవ్వుకుంది.

"చూడత్తయ్యా! సరస్వతిని జగన్నాథానికిచ్చి పెళ్లి చెయ్యటానికి నిశ్చయించానని, మీ అమ్మాయికి నామీద కోపం. భానుమూర్తికి యెలాగూ అది భార్య కాలేకపో యింది. మరో సన్నిహిత సంబంధం యెందుకు వదులుకో వాలి చెప్పు! వాళ్ళయినా సామాన్యులు కారు. బాగా డబ్బున్నవాళ్లే! అబ్బాయి చదువుకున్నవాడు, గుణవంతుడు. ఇన్నీ ఆలోచించే మాటిచ్చాను" అన్నాడు నరహరి.

కమల, అవేమీ తనకి పట్టనట్టే అక్కణ్ణించి వెళ్ళిపో బోయింది.

"వెళ్లిపోకు కమలా! నిలబడు.... మీ అమ్మే మంచి చెడ్డలు నిర్ణయించనీ" నవ్వుతూ అన్నాడు నరహరి.

యశోదమ్మ నవ్వింది మెల్లగా. కూతురికి తమ్ముడి మీదుండే అభిమానమే ఆమె నిరాకరణకి ముభావానికి మూలకారణమయిందని ఆమె నమ్మకం. అది కొంత వరకూ నిజమైనా, కమలలో పొంచివున్న అసూయమాత్రం యెవరికీ తెలీదు.

"పోనీవే అమ్మాయ్! అల్లుడు చెప్పిందికూడా నిజమేను. నీ తమ్ముణ్ణి అల్లుడుగా చేసుకుందామన్న వాంఛ నిలో వుండేది. కాని, వాడి దురదృష్టమో, మీ అదృష్టమో, యిప్పుడనుకుని ప్రయోజనమేముంది? జగన్నాథంకూడా మనకి పరాయివాడేమీ కాదు. అతడినైనా అల్లుడిగా చేసుకో" అంది యశోదమ్మ.

కమలకి తల్లిమీదకూడా రోషం వచ్చింది.

"నువ్వూరుకో అమ్మా! ఈ విషయంలో జోక్యం కలుగజేసుకోకు. ఆయనకి యెలా తిన్నగా వుంటే, అలానే ప్రవర్తించనీ" అంటూ లోపలికి చరచరా పోయింది. ఆమె మనస్సులో మాట మాత్రం యెవరికీ చెప్పలేదు.

సరస్వతి ప్రక్క గదిలోవుండి అంతా వింటోంది. జగన్నాథంని పెళ్ళిచేసుకోవడం ఆమెకు యేమీ ఇష్టంలేదు. చదువుకున్న అమ్మాయి. వేషభాషలకీ, అందచందాలకీ, అధిక విలువనిచ్చే వ్యక్తి. ఆమెకి జగన్నాథంలో అందంకాని, వేషంలో డాంబికంగాని అగుపించలేదు. అసలు అతని మొహంలో కళాకాంతులు లేవనే ఆమె అభిప్రాయం. భానుమూర్తిపై ఆమెకి ఒక విధమైన అభిమానం, అనురాగం వాటితోపాటు గౌరవం వుండేవి. కాని,

పరిస్థితులు తల్లక్రిందులవ్వడంతో, ఆ అభిప్రాయాన్ని మార్చుకుంది. జగన్నాథం విషయంలో అలాంటి అనుభూతిని పొందలేకపోయింది. అయితే తన అయిష్టతని వెలిబుచ్చే ధైర్యంకూడా ఆమెలో లేకపోయింది.

"చూశావత్తయ్యా, మీ అమ్మాయి వింత ప్రవర్తన?" అన్నాడు భార్య వెళ్ళిపోయిన కాస్సేపటికి నరహరి.

"పోనీలే నాయనా! క్రమంగా అదే మార్గాన పడుతుందిలే. ఇల్లాంటివాళ్ళని మనం ఎంతమందిని చూళ్ళేదు?" నవ్వుతూ తేలిగ్గా అనేసింది యశోదమ్మ.

"అదీ నిజమేలే!" అన్నాడు.

" మనం విశాఖపట్నం యెప్పుడు వెళ్దామంటావు నాయనా ?"

"ఈ ఆదివారం తప్పక వెళ్దామత్తయ్యా" అన్నాడు నరహరి.

యశోదమ్మ తృప్తిగా నవ్వుతూ లేచి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

*          *          *

జగన్నాథం వాల్తేరు వచ్చేశాడు. న్యూ కాలనీలో ఓ గది అద్దెకు తీసుకుని వుంటున్నాడు. విశాఖ జీవితం మొదట్లో అతనికి కాస్తంత కొత్తగా, ఎబ్బెట్టుగా అనిపించినా, క్రమంగా అలవాటుపడి, ఆ జీవితమే బావున్నట్టు ఫీలయ్యాడు. ఎంతోమంది కొత్తవారితో పరిచయమయింది.

మనిషో తరహాగా అగుపించేవారు. అయినా, వాళ్ళతో కాలం హాయిగా గడిచిపోయేది. జీవితంలో ఓ కొత్త అధ్యాయం ప్రారంభమయ్యేట్టుగా అనుభూతిని పొందాడు.

పరిచితులు చాలామంది వున్నా, అతనికి తృప్తి లేక పోయింది. రోజూ ఆఫీసుకి వస్తున్నపుడు జంక్షనులో బస్సు కోసం వేచివుంటున్న యువతి పరిచయాన్ని అతను కాంక్షి స్తున్నాడు. ఆమెను చూసిన మొదటి రోజుల్లో అతనికి యెటువంటి భావాలూ కలుగలేదు. కాని, రోజూ చూస్తున్న కొద్దీ, ఆమెపై అదోవిధమైన భావం పొడచూపింది. అది అభిమానమో, అనురాగమో, అతనికే స్పష్టంగా తెలీదు. ఆమె గురించి యింట్లో తీరిగ్గా కూచునప్పుడంతా ఆలో చిస్తూ ఉండేవాడు. ఇటువంటి అయోమయ స్థితిలో తండ్రి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది. సరస్వతితో పెళ్ళి నిశ్చయమై నట్లు రాశాడు. జగన్నాథం ఒక్కసారిగా స్వర్గలోకానికి వెళ్ళాడు. అతని హృదయంలో- జంక్షనులో అగుపించి, ఆలోచనలకు తావిచ్చిన యువతి మాయమై, ఆమె స్థానే సరస్వతీ స్థావరం ఏర్పర్చుకుంది. సరస్వతి రూపాన్ని ఊహించుకుంటూ మురిసిపోయాడు. తనింకా యెన్నాళ్ళో యీ ఒంటరి జీవితం గడపవలసిన అవసరం లేదు. తనూ ఓ యింటివాడై హాయిగా సంసారాన్ని సాగిస్తాడు ... ఈ కలలతోనే ఆ రాత్రి నిద్రపోయాడు.

రోజులు గడుస్తున్నాయి. ఓనాడు ఉబుసుపోక, అలా స్టేషనుకి వెళ్ళాడు జగన్నాథం. అప్పుడే మద్రాసు మెయిలు వచ్చింది. ప్లాటుఫారమంతా కోలాహలంగా వుంది. ఎవరైనా

తెలిసినవాళ్ళు అగుపిస్తారేమోనని యీ చివర్నించి ఆ చివరికి నడుస్తున్నాడు జగన్నాథం. లేడీస్ కంపార్టుమెంటు దగ్గర జంక్షనువద్ద అగుపించే ఆ అమ్మాయి తళుక్కుమని మెరవడంతో, జగన్నాథం కాళ్ళకి సడన్ బ్రేక్ పడింది. 'ఆమె యెక్కడికైనా ప్రయాణంలో వుందా?' అన్న ప్రశ్న అతని మెదడులో మెదిలింది. అక్కడే నుంచోడం సభ్యతగా వుండదని ముందుకు సాగిపోయాడు. కాని, దూరంలో నుంచుని ఆమె ప్రతి కదలికనూ గమనిస్తూనే వున్నాడు.

బండి కదిలింది. ఆ అమ్మాయి మాత్రం ప్లాట్ ఫారమ్ మీదే వుండిపోయి, స్నేహితురాలికి గామోసు వీడ్కోలు చెప్తోంది చెయ్యి వూపుతూ. బండి కనుచూపు మేర దాటింది. ఆ అమ్మాయి వెనక్కి తిరిగింది. జగన్నాథం మెల్లగా అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు. 'ఆమెతో పరిచయమైతే యెంత బావుణ్ణు! అసలు, యింతకీ ఆమె యెవరు? యేం చేస్తుంది?' యివే ప్రశ్నలు అతణ్ణి చుట్టుముట్టాయి. ఆ అమ్మాయి అతణ్ణి దాటుకుని పోయింది.

జగన్నాథం గేటు దగ్గరికి వెళ్ళేసరికి టికెట్ కలెక్టర్ ఆ అమ్మాయిని ప్రశ్నలతో ముంచేస్తున్నాడు. ఆ అమ్మాయి గాభరాపడుతూ, యేమీ చెప్పలేని స్థితిలో వుంది. మంచి అవకాశం దొరికిందనుకున్నాడు మనసులో.

"ఏమయిందండీ!" అన్నాడు సౌమ్యంగా టిక్కెట్ కలెక్టర్ని ఉద్దేశించి.

"చూడండి యీమె యెక్కణ్ణించో వస్తూ, తను

అసలు ప్రయాణం చేయలేదనీ, ఓ స్నేహితురాలు వెళ్తుంటే స్టేషనుకి వచ్చాననీ, ప్లాట్‌ఫారమ్ టిక్కెట్టు స్నేహితురాలి దగ్గర వుండిపోయిందనీ ఓ చక్కని కథ అల్లి చెప్తోంది. రోజూ రకరకాల ప్రయాణీకుల్ని చూసే మా కళ్లు మూయడానికి ప్రయత్నిస్తే యెట్లా!" అన్నాడు నవ్వుతూ టిక్కెట్టు కలెక్టర్.

"ఆమె ప్రయాణం చెయ్యలేదండీ! స్టేషనుకే వచ్చి వుంటుంది. బహుశా, స్నేహితురాలు కొన్న టిక్కెట్టుతో పాటు, యీమె ప్లాట్‌ఫారమ్ టిక్కెట్టుకూడా వుండిపోయిందేమో, ఆ తొందర్లో తీసుకోవడం మర్చిపోయి వుంటుంది. పోనిద్దురూ!" అన్నాడు అయాచితంగా చొరవతీసుకుని.

టిక్కెట్టుకలెక్టరు జగన్నాథం వేపుఅదోలాచూశాడు.

"ఈమె స్టేషనుకే వచ్చిందని మీరెలా చెప్పగలరండీ?" అన్నాడు అదోలా మొహం పెట్టి.

జగన్నాథం సందిగ్ధంలోపడ్డాడు యేంచెప్పడమాఅని.

"ఈమె స్టేషనుకి రావడం మాత్రం నేను చూశాను, అంతవరకే నేను చెప్పగలను." నా మాటమీద మీకు నమ్మకముంటే చాలా 'థేంక్స్' ఇదిగోండి నా టిక్కెట్టు. అంటూ టిక్కెట్టు అతని చేతిలో పెట్టి వచ్చేశాడు జగన్నాథం హుందాగా.

టిక్కెట్టు కలెక్టరు యేమనుకున్నాడో మరి.... "వెళ్లండమ్మా; వెళ్ళండి ఎప్పుడూ యిలా చెయ్యక" అనేశాడు విసుగ్గా.

ఆ అమ్మాయి పాలిపోయిన మొహం చేతిరుమాలుతో

వొత్తుకుంటూ బైటికి వచ్చింది. కాస్త దూరంలో నుంచున్న జగన్నాథం దగ్గరకు వచ్చి "చాలా థ్యాంక్సండీ, వీళ్ళకి కాస్తయినా మర్యాదా, మట్టూ తెలీదు. అసలు ఆలోచన న్నది యే కోశానా లేదు." అందామె.

జగన్నాథం మనస్సు అలలపై తేలుతోంది. ఏ పరిచయం కోసం తను తహతహలాడాడో, యే మృదు మధుర గొంతుకోసం వువ్విళ్ళూరాడో ఆ పరిచయం లభించింది. ఆ గొంతు తనతోనే మాట్లాడుతోంది....

"వాళ్ళనలా నిందించడం భావ్యం కాదండీ! వాళ్ళయినా యేం చేస్తారు? వాళ్ళ వుద్యోగ ధర్మం నిర్వర్తించారు. అందరూ యిలానే చెప్పుకొని తప్పించుకునిపోతుండే రోజులివి. అందుకే యెవరి మాటలూ నమ్మడానికి వాళ్ళకి సాధ్యం కాకుండా వుంది." అన్నాడు.

"సమయానికి మీరు రాకపోతే, యింకా యెంతసేపు నన్నక్కడ ఆపేవారో యేమిటో! నిజంగా ఆ క్షణం సేపూ నుంచోడానికే నాకు అదోలా అన్పించింది. మీ మేలు యెప్పటికీ మర్చిపోను" అంది కృతజ్ఞతాభావంతో.

"ఆ దానికేముంది లెండి. మిమ్మల్ని అప్పుడప్పుడూ చూస్తున్నాను గాబట్టి ఆ స్థితిలో ఆదుకోవాలన్పించింది. తెలీని మొహమైతే నేనూ నా దారిన పోయేవాణ్ణిగా!"

ఆ అమ్మాయి ఆశ్చర్యంగా అతనివేపు చూసింది.

"నన్ను చూశారా ? ఎప్పుడు ?" అంది.

"రోజూ చూస్తున్నానండీ! అదిగో ఆ కన్పిస్తున్న జంక్షనులో బస్సుకోసం కాచుకుని వుంటుంటారు. సరిగ్గా

అదే సమయంలో నేను ఆఫీసుకు పోతుంటాను."

ఆ అమ్మాయి ఆలోచన సాగించింది. "జ్ఞానండీ, యిప్పుడు గుర్తుకొచ్చింది. మిమ్మల్ని యెక్కడో చూసినట్టుగానే వుందిగాని గుర్తుతెచ్చుకోలేక పోయాను. మీ రెక్కడ పనిచేస్తున్నారు?

"కలక్టరేట్‌లో.... మరి మీరో? ఉద్యోగం చేస్తున్నారనుకుంటాను?" అధే అవకాశం అతనికి మరి....?

"పోర్టులో పనిచేస్తున్నాలెండి...." అంది ముసి ముసి నవ్వుల్తో.

ఆమె వివరాలు కొంతవరకు తెలిశాయిగాని పేరు మాత్రం తెలీలేదు.

"మరి మీ పేరు చెప్పారు కాదు" చొరవచేసి అన్నాడు.

"లీలావతి లెండి. కాని అంతా నన్ను లిల్లీ అనే పిలుస్తారు.... మరి మీ పేరు?"

"మీరడక్కపోయినా చెప్పే వాణ్ణే; జగన్నాథం"

కాసేపుయిద్దరూమౌనంగావూరుకున్నారు "ఇలాగైనా మనకి పరిచయం జరగడం, నిజంగా ఆనందించవల్సిన విషయమే; పదండి పోదాం...." అంటూ ముందుకు నడిచాడు జగన్నాథం.

ఈ కొద్దిపాటి పరిచయంలోనే వాళ్ళిద్దరూ యెన్నాళ్ళనుంచో పరిచయమున్న వ్యక్తుల్లే నడుచుకుంటూ పోతున్నారు. ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు. ఒక్కోసారి కొన్ని సెకండ్లపాటు మౌనంగా నడిచారు. లిల్లీ కాస్తదూరం

నడిచాక "వస్తానండీ మరి" అంటూ అడ్డరోడ్డు పట్టింది.

ఆమె వునికి తెలుసుకోవాలన్న వుత్సుకత జగన్నాథంలో వున్నా, చొరవ తీసుకుని అడిగే ధైర్యంగానీ, ఆమెను అనుసరించే ఆలోచనగానీ లేకపోయింది. 'మంచిదండీ' అంటూ తన దారిన తాను పోయాడు భారంగా అడుగులు వేసుకుంటూ.

ఆ రాత్రి జగన్నాథం అవస్థ చెప్పలేం. కళ్ళు మూసినా, కళ్ళు తెరిచినా లిల్లీయే అగుపిస్తోంది. ఆమె మాటలే చెవుల్లో గింగురు మంటున్నాయి. సరస్వతి స్థానాన్ని మళ్ళీ లిల్లీ ఆక్రమించుకొన్నది.

* * *

క్రమంగా లిల్లీ, జగన్నాథంల పరిచయం చివురించి పువ్వులు తొడిగింది. ఇద్దరి మనసులూ రోజు రోజుకీ సన్నిహిత మౌతున్నాయి. సాయంకాలం పూటలు యిరువురికీ హాయిగా గడిచిపోతున్నాయి. రోజూ యిద్దరూ కలిసి కబుర్లు చెప్పుకుంటుండేవారు ఒకరి విషయాలు ఒకరు.

# 12

సరస్వతీ టాకీసు బయట జనం క్రిక్కిరిసి వున్నారు. వస్తున్నవాళ్ళు యింకా వస్తూనే వున్నారు. భానుమూర్తి, సావిత్రి రిక్షా దిగారు. వాళ్ళిద్దరూ మొట్టమొదటి సారిగా కలిసి సినిమాకు వెళ్ళడం యిదే. భానుమూర్తి టిక్కెట్లు కొనడానికి కౌంటరు దగ్గరికి వెళ్ళాడు. టిక్కెట్లు తీసుకొని వెనక్కి వస్తుండే సరికి జగన్నాథం ప్రత్యక్షమయ్యాడు. విస్తుపోయి ఒకర్నొకరు చూసుకుని 'హలో' అంటే 'హలో'

అనుకున్నారు. "టికెట్టు తీసుకోండి...." అన్నాడు భాను మూర్తి.

జగన్నాథం సందిగ్ధావస్థలో పడ్డాడు. తను ఒంటరిగా రాలేదు. లిల్లీ కూడా వచ్చింది. 'ఇద్దరికీ టికెట్లు తీసుకుంటే ఆమె యెవరని భానుమూర్తి అడిగితే తనేం చెప్తాడు?, అన్న ప్రశ్నతో కాసేపు కుస్తీ పట్టాడు. కాని తీసుకోక తప్పదను కుని రెండు టికెట్లు తీసుకున్నాడు.

"రెండెందుకో? ఇంకెవరైనా స్నేహితుడున్నాడా?" అన్నాడు భానుమూర్తి.

జగన్నాథం తడబడ్డాడు. "ఔనండీ! ఓ స్నేహితురాలు వుంది" అన్నాడు. ఇద్దరూ బైటికి వచ్చారు. తీరా చూస్తే సావిత్రీ, లిల్లీ కాస్తంత దూరంలోనే నుంచుని వున్నారు. జగన్నాథంకి పరిస్థితి చాలా విషమయంగా తోచింది. కాని యేం చేస్తాడు ?

పరిచయాలయ్యాక సావిత్రీ, లిల్లీ క్షణంలో సన్ని హితులయ్యారు.

హాల్లో నలుగురూ ఒకే దగ్గర కూచున్నారు. సావిత్రీ లిల్లీ సినిమా చూస్తూ ఆనందిస్తుంటే, జగన్నాథం రాబోయే పరిణామాన్ని వూహించుకుంటున్నాడు. భానుమూర్తి 'యీ లిల్లీ యెవరా?' అని తలపోస్తున్నాడు.

సినిమా విడిచిపెట్టాక యెవరిత్రోవన వారు పోయారు.

"లిల్లీ అతని భార్యా యేవిటండీ?" అంది యిల్లు చేరుకున్నాక సావిత్రి.

"అతనికింకా వివాహం కాలేదు. ఆ అమ్మాయితో మెలా పరిచయమయిందో అర్థంకావడం లేదు" సాలోచనగా అన్నాడు భానుమూర్తి.

"ప్రేమికులన్నమాట!" మెల్లగా అంది సావిత్రి మందహాసంతో.

"మనలాగే"నవ్వుతూఅన్నాడు మూర్తి. మరింకేమీ మాట్లాడవద్దన్నట్టు అతని నోరు మూసింది సావిత్రి.

* * *

పార్వతమ్మగారింటికి కాస్త దూరంలో సోమశేఖరం గారిల్లు వుంది. సోమశేఖరంగారు రిటైరై యాభైవేల రూపాయల విలువచేసే మేడ కట్టించుకున్నారు. కొన్ని గదులు అద్దెకిచ్చేశారు. సోమశేఖరంగారి కుటుంబం పార్వతమ్మ గారి కుటుంబానికి చిరపరిచితులు.

ఓరోజు సోమశేఖరంగారి భార్యా,యిద్దరు కూతుళ్ళూ పార్వతమ్మగారింటికి వచ్చారు. పార్వతమ్మ వాళ్లని ఆహ్వానించి కూచోబెట్టింది. సావిత్రిని కూడా వాళ్ళకి పరిచయం చేసింది. సావిత్రితో పరిచయమైనందుకు ఆ యిద్దరు అక్కచెల్లెళ్ళు యెంతగానో ఆనందించారు.

"మీది యే వూరండీ" అంది పెద్దమ్మాయి.

"ఈ వూరేనండీ" ముక్తసరిగా జవాబిచ్చింది సావిత్రి.

'మీవాళ్ళు యెక్కడుంటున్నారేమిటి ?'

"డాబా గార్డెన్సులో వుంటున్నారు...."

"అయితే మీవారిది యీ వూరు కాదనుకుంటాను" రెండో అమ్మాయి ప్రశ్న వేసింది.

వాళ్ళ ప్రశ్నలకి అంతం వుండదేమో ననిపించింది సావిత్రికి.సావిత్రి విసుగు చెందడం గ్రహించి తనే కలిపించుకుంది పార్వతమ్మ.

"అతనిదీ యీ వూరేనమ్మా, కలెక్టరాఫీసులో పని చేస్తున్నాడు...." అంది.

"కలక్టరాఫీసులోనా!"వింతగాఅడిగింది పెద్దమ్మాయి.

"ఔనమ్మా"

"పేరు ?"

'భానుమూర్తి....' అంటూ 'నీకు శ్రమ తగ్గిస్తున్నా నుత్రీ' అన్నట్టుగా సావిత్రివేపు చూసింది పార్వతమ్మ.

ఆ అక్క చెల్లెళ్ళిద్దరూ మొహాలు చూసుకున్నారు.

"అతను యిక్కడుంటున్నాడా! అతను లేవదీసుకు పోయిన అమ్మాయి యీవిడే నన్నమాట! మా అన్నయ్య కూడా ఆ ఆఫీసులోనే పనిచేస్తున్నాడుకమా మామ్మగారూ! యీ విషయమంతా చెప్పాడు."చూడ్డానికి యీవిడ చాలా అమాయకురాల్లానే అగుపిస్తుంది సుమండీ!" అంది పెద్దమ్మాయి.

సావిత్రి మనస్సు చివుక్కు-మంది. వెన్నుమీద యెవరో పొడిచినట్టయ్యింది. కళ్ళు నీళ్ళు పర్యంత మయ్యాయి. ఆ అమ్మాయి అన్నమాటల అంతరార్థ మేమిటో వూహించుకుని బావురుమని యేడ్చేస్థితికి వచ్చేసింది. అక్కడ యింకొక్కక్షణం వుండలేక పోయింది.

"వస్తానండీ!" అంటూ లేచి చర చరా గదిలోకి వచ్చి తలుపులు వేసుకుని, మంచంమీద బోర్లాపడి బావురుమంది మౌనంగా.

సోమశేఖరంగారి భార్య మాత్రం కాస్తంత చలించింది సావిత్రి వెళ్ళిపోవడంచూసి.

"మీ కెందుకర్రా పూళ్ళో విషయాలన్నీ?" అని వారించింది కాని వాళ్ళు అగిపోలేదంతటితో.

"మీరెలా వీళ్ళకిచోటిచ్చారండీ మామ్మగారూ!" అంది పెద్దమ్మాయి మళ్ళీ.

పార్వతమ్మ వాళ్ళ ప్రవర్తనకి యెంతో బాధపడింది. అయినా, ముఖా ముఖి వాళ్ళని వాదించేధైర్యం లేక పోయింది. వాళ్ళు గొప్పవాళ్లు. అదే వారికున్న గౌరవం, అధికారం. ఆ అధికారమే వాళ్ళనలా అనిపిస్తోంది. పార్వతమ్మకి తెలుసు ఆవిమర్శించే అమ్మాయిల నైతిక ప్రవర్తన యెలాంటిదో. అయితేనేం, అవన్నీ ధనమనే తెర వెనుక కప్పబడిపోయాయి. వాటిని రెచ్చగొట్టి వాళ్ళని నిందించడం యెవరికి సాధ్యం?

"ఏం చెయ్యనమ్మా? మా చిన్నబ్బాయీ, భానుమూర్తీ, ప్రాణస్నేహితులు – ఎవరూ దగ్గరికి చేరనివ్వక పోతే యెట్లా? మావాడి బలవంతం, నాలో కలిగిన కనికరం నన్నలా ఒప్పించాయి. అయినా ఇందులో తప్పేవుంందమ్మాయీ! ఏదో తెలియని ఆవేశంలో తప్పుచేశాకే

అనుకో! యిప్పుడు హాయిగా సంసారం చేసుకుంటున్నారు. ఏ ఆలు మగలికీ పీళ్ళు తీసిపోరు...." అంది పార్వతమ్మ.

పార్వతమ్మ సావిత్రిని అలా వెనకేసుకు రావడం వాళ్ళకి యిష్టంలేకపోయినా యింకేమీ అనలేకపోయారు.

"మరి వస్తానమ్మా...." అని లేచింది సోమశేఖరం భార్య.

"మంచిదమ్మా!" అంది పార్వతమ్మ. వాళ్లు వెళ్ళి పోయారు.

పార్వతమ్మ సావిత్రి గదిలోకి వచ్చింది. సావిత్రి కళ్ళు వాచినట్లు స్పష్టంగా అగుపిస్తున్నాయి. కన్నీటిచారలు చెక్కిళ్ళపైకొట్టొచ్చినట్లు కనిపిస్తూనేవున్నాయి. పార్వతమ్మ ఆమె తల నిమురుతూ "పిచ్చిపిల్లా! ఈ మాత్రం దానికేనా! లోకంకాకులమ్మా-అనేకంఅనుకుంటూరు. ఉన్నవాటితో లేనివి కూడా కల్పించి ఆడిపోసుకునేరోజులివి. అలాంటప్పుడు నీ విషయంలో అనడం ఒక లెక్కలోది కాదు. ఈ విమర్శ లకు తట్టుకోగలిగే శక్తిని నీ దగ్గర యెప్పుడూ వుంచు కోవాలి. అలా అంటారని బాధపడి కుమిలితే ఒక్క క్షణం కూడా యీ ప్రపంచంలో జీవించలేవు." ఓదార్పుగా అంది.

"పిన్నీ, నా బ్రతుక్కి ఓ మార్గం అగుపించడంలేదు. అంతా అయోమయంగా వుంది" అంటూ పార్వతమ్మ ఒడిలో తలదాచుకుని బావురుమంది సావిత్రి.

"ఛ! ఛా! అదే వద్దంటాను. ఏడిస్తే ధైర్యం దిగజారుతుందన్న మాటే! లే అమ్మాయ్ లే.... ధైర్యం తెచ్చుకో! వెళ్లి మొహం కడుక్కో.. కన్నీటిచారలు స్పష్టంగా అగుపిస్తున్నాయి. లేచి వంట ప్రయత్నం ప్రారంభించు" అంది పార్వతమ్మ సావిత్రిని ఓదారుస్తూ.

సావిత్రి కళ్ళు ఒత్తుకుంది. పార్వతమ్మ వంట ప్రారంభించాలని వచ్చేసింది. సావిత్రికూడా లేచి వంటగది వేపు పోయింది.

ఆరోజు రాత్రి భర్తతో మధ్యాహ్నం సోమశేఖరం గారి అమ్మాయిలు అన్నవన్నీ పూసగుచ్చినట్టు చెప్పింది సావిత్రి. భానుమూర్తి బాధగా నవ్వేడు.

"అనుభవించవల్సిందే సావిత్రీ ఏంచేస్తాం? మనం ఆవేశంతో వేసిన తప్పటడుగుకి ప్రాయశ్చిత్తం అనుభవించవల్సిందే! మనకంటె ఘోరాతి ఘోరమైన తప్పులు గుప్తంగా చేస్తున్న వ్యక్తులు నిశ్చింతగా, సంఘంలో గౌరవంగా బ్రతుకుతున్నారు. వాళ్లు బైటపడ్డంలేదు. మనం బైటపడ్డాం గనుకనే అనుభవిస్తున్నాం....నా మాటకేం? మగవాణ్ణి యెలాగైనా సర్దుకుపోతాను. నీ గురించే నేనెప్పుడూ ఆలోచిస్తుంటాను. నీ అంతరాళంలో సంక్షోభం, సంఘంలో నీ అంతస్థుగురించే యోచిస్తూ వుంటాను. కాని, యేంలాభం? మన చేతుల్లో యేమీలేదు. ఎవరేమన్నా సహనంతో మౌనం వహించాల్సిందే! బాధపడ్డం మరి

పోవాలి. ధైర్యం కూడగట్టుకోవాలి.” అన్నాడు మూర్తి బాధగా.

సావిత్రి దుఃఖాన్ని ఆపుకోలేక భర్త వక్షంపై వాలింది. ఆమె వెచ్చని కన్నీరు భానుమూర్తి గుండెలపై జల జల రాలింది.. దూరంలో దీపం మాత్రం మిణుకు మిణుకు మంటోంది.

## 13

ఆదివారం అందరూ కలిసి విశాఖపట్నం వస్తామని అనుకున్నారు నరహరి, కమలాను. కాని రావడం జరిగింది కాదు అకస్మాత్తుగా సరస్వతికి వంట్లో బాగులేకపోయింది. ఆ అస్వస్థత యేమిటో ఆమె స్పష్టంగా చెప్పదు. అందుకే ఆగిపోయారు. ఒక్క యశోదమ్మ మాత్రం వెళ్ళిపోయింది.

సరస్వతికి నిజంగా అస్వస్థత కాదు. ఆమె హృదయంలోని భావం, ఆవేదన వేరు. మొదట్నుంచీ భానుమూర్తిని వివాహం చేసుకుంటానని ఆమె మురిసిపోయింది. ఎన్నెన్నో కలలు కన్నది. అతడంటే ఆమెకి అనన్యమైన అభిమానం. కాని తండ్రి ఒప్పుకోలేదు ఆ పెళ్ళికి. ఆయనకి భానుమూర్తి మీద యెందుకలాంటి అభిప్రాయం జనించిందో ఆమెకి బోధపడలేదు. మావయ్యలో ఆమెకి ఏ ఒక్క చెడుబుద్ధి అగుపించలేదు. ఇలాభ్రాంత గా భాను

మూర్తి సావిత్రిని లేవదీసుకుపోయాడు. అదో పెద్ద షాక్ అయింది సరస్వతికి. తను కోడలుగా అడుగు పెట్టవల్సిన యింటికి, ఇప్పుడు చుట్టంచూపుగా వెళ్ళి, తనస్థానేవున్న సావిత్రిని చూడ్డం ఆమెకి యిష్టంలేకపోయింది. ఆ అయిష్టత నే తన అస్వస్థత రూపంతో బైటపెట్టింది. తనూ ఒక యింటికోడలయ్యాక అక్కడికి వెళ్ళవచ్చునని మనసులో అనుకుంది.

కూతురు అస్వస్థతగా వుందని చెప్పిన తక్షణం నరహరి డాక్టర్ని తీసుకొచ్చాడు. డాక్టరు ఆమెను పరీక్ష చేశాడు. అసలు జబ్బు అంటూ ఏమైనా వుంటేగా ఏదో ఒకటి చెప్పాలిగనుక నీరసంగావుంది తప్పమరింకేమీ లేదని చెప్పాడు. టానిక్ కొనమని రాసిచ్చాడు. తనఫీజు మాత్రం పట్టుకుపోయాడు.

జగన్నాథం తండ్రి దగ్గర్నుంచి ఆ సోమవారం వుత్తర మొచ్చింది. కట్నంలో సగం ముందుగా పంపమని. నరహరికి అందులో యేమీ అసందర్భం అగుపించలేదు. పంపించేయాలనే నిర్ణయానికే వచ్చాడు. కాని సమయం కోసం కాచుక్కూచున్న కమల మాత్రం ఒప్పుకోలేదు.

"ముందుగా సగం కట్నం యివ్వడ మేమిటండీ? నే నెక్కడా వినలేదు యీ పద్ధతి" అంది.

"పండ్లో యివ్వడం చట్టానికి విరుద్ధమని కామోసు, సగం యిప్పుడే పంపమంటున్నారు!" అన్నాడు నరహరి.

"బావుందండీ! చట్టానికి విరుద్ధమైతే పందిట్లో యివ్వకండా చాటుగానే యిస్తాం. మనమీద ఆపాటి

నమ్మకముండదా మేవిటి? మనల్ని వాళ్ళు నమ్మక పోయినప్పుడు వాళ్ళని మనమెలా నమ్మగలం?" అంది అబల తెలివితేటలు యెలాంటివో కాస్త తెలియజేస్తూ.

అదీ నిజమేననుకున్నాడు నరహరి.

"అయితే మరేం చేద్దామంటావు? అనవసరంగా తగువులు పడ్డం నాకిష్టంలేదు కమలా" అన్నాడు సౌమ్యంగా.

"తగువులు వాళ్ళే ప్రారంభిస్తున్నారు. మన అమ్మాయిని వాళ్ళకివ్వడమే వాళ్ళకో ఘనత. అది గాకండా మనమే అన్నింటికీ వాళ్ళు చెప్పినట్టు చేస్తుంటే యింకేవిటి? అలా వీల్లేదు. అంతా ఒకేసారి యిస్తామని రాసేయండి. యిదంతా మీ మరదలు సీత తెచ్చినదే" అంది కటువుగా.

నరహరి కాసేపు ఆలోచించాడు. భార్య చెప్పిందంతా సవ్యంగానే వుందనుకున్నాడు.

"అలాగే రాసేద్దాం ... వాళ్ళనాన్నకీ, సీతకీ చెరో ఉత్తరం రాసేస్తే పోయె...."

"ఔను అలాగే రాయండి. మనం ఒక్క అంగుళమైనా జరగొద్దు" తన అక్కసు యిలాగైనా తీర్చుకుంటున్నందుకు మురిసిపోయింది కమల.

నరహరి యింకేమీ అనలేదు. టేబిలుదగ్గరికి వెళ్ళి ఉత్తరాలు రాసేశాడు.

*    *    *

జగన్నాథం, లిల్లీ కాలవగట్టుమీద కూచున్నారు. కాలవలో నీరు మందంగా పారుతోంది. గట్టు పచ్చికతో నిండివుంది. దూరంలో కొండలూ, వాటిని పలుకరించడానికి వచ్చినట్టుగా మేఘాలూ యెంతో ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి.

"మిమ్మల్ని ఓ మాట అడగాలని వుందండీ!" అన్నాడు జగన్నాథం.

లిల్లీ సూటిగా అతని మొహంలోకి చూసింది.

"అదిగోండి, మళ్ళీ మీరు ఆ ధోరణే అవలంబిస్తున్నారు. ఆ బహువచనంలో సంబోధించడం నా కేదో యెబ్బెట్టుగా అన్పిస్తుంది. దయచేసి అలా పిలవకండి" అంది.

జగన్నాథం నవ్వుకున్నాడు.

"సరే! అలా పిలవన్లెండి....సారీ అలా పిలవను ... నినో విషయం అడగాలని వుంది లిల్లీ ...."

"అడగవద్దని యెప్పుడన్నా వారించానా? అడగండి" చిరునవ్వుతో అంది.

జగన్నాథం కాసేపు తటపటాయించాడు.

"నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను వివాహం చేసుకుంటాను." అన్నాడు.

లిల్లీ తృళ్ళిపడింది. ఎప్పటికైనా యీ ప్రశ్న అతని నోట వస్తుందని ఆమెకి తెలుసు. కాని యింత త్వరలోనే

అతను చొరవ తీసుకుంటాడని అనుకోలేక పోయింది. ఏం జవాబు చెప్పనా అన్న సందిగ్ధంలో పడింది.

జగన్నాథం ఆమె మౌనాన్నిచూసి కాస్తంత గాభరా పడ్డాడు.

"మౌనం దాల్చావేం లిల్లీ? నేనంటే నీకు యిష్టం లేదా?" అన్నాడు ఆసక్తిగా యేం జవాబు వస్తుందోనని యెదురుచూస్తూ.

"ఇష్టంలేక కాదండీ! వివాహమంటే నాకు సదభిప్రాయంలేదు. కొన్ని నియమాలకీ, నిబంధనలకీ కట్టుబడి ఒక సూత్రంమీద నడవడం, ఒక్కొక్కప్పుడు సంఘానికి భయపడి కృత్రిమంగా ప్రవర్తించడం నాకు నచ్చదు. అదేకారణంవల్ల నేను వుద్యోగంలో చేరాను" అంది.

జగన్నాథం నివ్వెరపోయి తెల్లమొహం వేశాడు. నిర్మించుకున్న గాలి మేడలన్నీ పగిలిన గాజు పెంకుల్లా చెదిరిపోయినట్టుగా ఫీలయ్యాడు. అతని మొహం వివర్ణమయింది. క్షణంసేపు మాట్లాడలేదు.

లిల్లీ అతని మొహంకేసి చూస్తోంది. అతను అంతర్గతంగా అనుభవిస్తున్న బాధను అవగతం చేసుకుందుకు ప్రయత్నిస్తోంది. అతని ముఖకవళికలు చూశాక యెందుకో ఆమెకు జాలి పుట్టింది అతనిమీద. తనలోనూ యేదో బాధ, ఓ విధమైన అనుభూతి వుద్భవిస్తున్నాయని ఆమె గుర్తించింది.

"నీ మీద నే నెన్నో ఆశలు పెట్టుకుని వున్నాను లిల్లీ! నా హృదయ పీఠంలో నువ్వు శాశ్వతంగా స్థావరం యేర్పరుచుకున్నావంటే నువ్వు నమ్మవు - కన్ను మూసినా కన్ను తెరచినా, నువ్వే అగుపిస్తున్నావు. నిన్నే నా జీవిత సర్వస్వంగా, నా దేవతగా భావించాను. అలాంటి నన్ను యీ నిరాకరణతో నిరుత్సాహ పరుస్తున్నావా!" అన్నాడు ప్రాధేయంగా.

లిల్లీ చప్పున మాట్లాడలేకపోయింది. ఏదో అవ్యక్తమైన అనుభూతి, మధురమైన భావన, ఆమెను అలా చేయించింది. తనని యింతగా కోరుతున్న వ్యక్తిని వదులుకోవడమెలా? ఆమె మనోనిర్ణయంలో అప్పుడే మార్పు వచ్చేసింది. జగన్నాథం ఆమె మౌనాన్ని భరించలేకపోయాడు.

"నీ అభిప్రాయాన్ని మార్చుకో లిల్లీ, నా కోసం మార్చుకో! లేకపోతే నేను పిచ్చివాణ్ణవుతానేమో!" అంటూ చప్పున ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. అతని చేయి కంపిస్తున్నట్టు గ్రహించింది లిల్లీ. ఆమెలో యేదో అనుభూతి కలిగింది. చేతిని విదిలించుకోలేకపోయింది. సిగ్గుతో మొహం దించుకుని, ముసి ముసి నవ్వుల్ని వెదజల్లుతూ, "మీ రయితే మోజుపడుతున్నారు.... కాని, మీ వాళ్ళు ఒప్పుకుంటారా అని?" అంది.

ప్రాణం లేచి వచ్చినట్టయింది. జగన్నాథానికి చుట్టూరా వసంతం వెల్లివిరిసినట్టనిపించింది. ఆనందోత్సా

హంతో హృదయం గంతులేసింది. "అదంతా నేను చూసు కుంటాను లిల్లీ! నువ్వు 'ఊఁ' అనడమే నాకు కావాలి. మా వాళ్ళు ఒప్పుకోకపోయినా సరే నిన్ను చేపట్టితీరుతాను...." ఉద్రేకంగా అన్నాడు. లిల్లీ నవ్వింది.

"మీ వాళ్లకి ఆవేశం ఎక్కువండీ! తీరా మీవాళ్ళు వద్దనేసరికి చల్లబడిపోతారు...." అంది.

"లేదు లిల్లీ! నా మాట నమ్ము...."

"ఏమో! నాకు భయమేస్తోందండీ! మీ వాళ్ళు యెలాగూ ఒప్పుకోరు. వాళ్ళకి రావల్సిన కట్నాలూ, కాను కలూ పోతాయిగా! ఇక తర్వాత తగూలుపడ్డం యెందు కండి!"

"తగువులేమీ వుండవు. మన వివాహం వాళ్ళకి యిష్టంలేకపోతే, మనకి దూరంగా వుంటారు. అంతేగా వాళ్ళు చెయ్యగలిగింది? మనం పెళ్ళిచేసుకుందాం...."

లిల్లీ క్షణం ఆలోచించింది. "పెళ్ళాయ్యాక మీరు నన్ను వుద్యోగం విడిచిపెట్టమంటారేమో!" అంది సూటిగా జగన్నాథం మొహంలోకి చూస్తూ.

"ఔను, ఉద్యోగం విడిచిపెడతావు...."

"మరి మా అమ్మకి కొంత డబ్బు పంపిస్తూ వుండా లిగా! అదెట్లా సాధ్యపడుతుంది?" అంది లిల్లీ.

జగన్నాథం ఆలోచనలో పడ్డాడు. "పోనీ, మీ

అమ్మకూడా మనదగ్గరే వుంటుంది. ఇంక పంపడ మెందుకు డబ్బు?" అన్నాడు.

లిల్లీ మాట్లాడలేదు క్షణంసేపు. మగవాళ్ళమాటల మీద ఆమెకు నమ్మకంలేదు. వాళ్లు చెప్పినవన్నీ చెయ్యరని ఆమె భావం. అందుకే, యేం చెయ్యడమా అని ఆలోచిస్తోంది.

"మీ పట్టుదలగానీ, మన స్నేహం యిలాగే వుంటే యేం పోయింది?" అంది మరేమీ అనలేక.

"ఉఁహూఁ, అలా వీల్లేదు. మనం వివాహం చేసుకోవల్సిందే!" అంటూ ఆమెను దగ్గరగా తీసుకున్నాడు.

"వేళయింది, పదండి పోదాం ..." అంటూ లేచింది లిల్లీ అతని పట్టువిడిపించుకుంటూ.

ఇద్దరూ లేచి యింటిముఖం పట్టారు. ఆ మరుసటి రోజే వాళ్ళు పెళ్ళిళ్ళ రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్ళారు.

## 14

నరహరి పెళ్ళి ఏర్పాట్లు చాలవరకు పూర్తి చేశాడు. పెళ్ళికి మరో పదిహేనురోజుల వ్యవధే వుంది.

అనంతం, అతని భార్య సీత, పిల్లలతో సహా దిగారు ఆరోజు. పెళ్ళింకా పదిహేనురోజులుండగా [illegible]

Telaprolu.

అప్పుడే యెందుకు వచ్చేశారో అర్థంకాలేదు నరహరికి. ఇన్నాళ్ళూ వాళ్ళంతా యింట్లో కూచుంటే యెట్లా? తనంటే స్వయానా అన్నగాబట్టి యేమీ అనుకోడు. కాని కమల పరాయిదిగా ఇక వీళ్ళతో యెన్ని తగవులుపడాలో అనుకున్నాడు. వాళ్ళందర్నీ మామూలు ధోరణిలో పలుకరించేశాడు. అందరూ యింట్లోకి నడిచారు. కమల బలగాన్ని చూసి లోలోన విసుక్కుంది. అయినాసరే పలుకరించకుండా వుండగలదా! ముక్తసరిగా పలుకరించింది.

"అకస్మాత్తుగా యిలా దిగబడ్డారేవిట్రా అనంతం, వచ్చేముందు ఓ ఉత్తరం లేదు ....పత్రం లేదు ..." అన్నాడు నరహరి.

అనంతం జవాబు చెప్పలేదు. ఆముదం తాగినవాడిలా మొహంపెట్టి, భార్యవేపు మౌనంగాచూశాడు. సీత గట్టిగా నిట్టూర్చింది. ఆమె మొహం బాగా పాలిపోయి వుందనే చెప్పాలి. "ఏమని ఉత్తరం రాస్తాం బావా! అంతా తల్లక్రిందయింది. అందుకే ఉత్తరంరాయకుండా స్వయంగా వచ్చాం. అక్కడ అమ్మా, నాన్నా యెంత బెంగపెట్టుకుంటున్నారో యేవిటో!" అంది బాధగా.

నరహరికి యేమీ బోధపడలేదు. ఆమె వల్లించిన వాక్యాల సారాంశం దేనికి అన్వయించుతుందో తేల్చుకోలేకపోయాడు. కమలకూడా అదే అవస్థలో వుంది.

"ఏవిటో బోధపడ్డంలేదు. ఏం జరిగింది?" అన్నాడు నరహరి ఆసక్తిగా,

అనంతం చెప్పేయాలన్న వుత్సుకత కనబర్చాడు. కాని సీత తీక్షణంగా అతనివేపు చూసేసరికి మొహం దించుకున్నాడు.

"మా తమ్ముడు యెవరికీ తెలీకండా పెళ్ళిచేసుకున్నాడు బావా" అంది కన్నీరు పెట్టుకుంటూ.

నరహరి తలమీద పిడుగు పడినట్టయింది. చప్పున మాట్లాడలేకపోయాడు. కమల కాస్తంత కలవరపడినా, పెళ్లి తప్పిపోయినందుకు సంతసించింది మనసులో. నరహరి అయోమయంగా మరదలివేపు చూస్తూ. "ఎవర్ని పెళ్ళిచేసుకున్నాడు? ఎప్పుడు? ఏవింటి?" అన్నాడు ఆతృతగా.

"ఎవరో 'లిల్లీ' అనే అమ్మాయినట. పెళ్ళిచేసుకున్న తర్వాత మాకు ఉత్తరం రాశాడు. వాడికేం పోయే కాలం పట్టుకుందో యేవింటో!" అంది సీత వుడుకుమోత్తనంగా.

కమలకి మంచి అవకాశం లభించింది. తనతమ్ముడ్ని ఆడిపోసుకున్న తోడికోడలకి తిరుగుదెబ్బ కొట్టాలనుకుంది. "పోయేకాలం యేవింటిలే సీతా! పరిస్థితులకు అందరము జోహారనవల్సిందే! అతడికి యెలాంటి క్లిష్ట పరిస్థితులు యేర్పడ్డాయో యెవరికి తెలుసు? కావాలని ఎవరూ కష్టాలు తెచ్చిపెట్టుకోరు కదా? వాళ్ళిద్దరి మనసులు కలిశాయి గామోసు. విడిపోలేకపోయారు. మా తమ్ముడు చేసిందీ యిదేగా, వాణ్ణి మనమందరమూ ఆడిపోసుకున్నాం...." అంది పరోక్షంగా సీత తమ్ముణ్ణి విమర్శిస్తూ.

సీతకి చెళ్ళున చెంపకాయ కొట్టినట్టయింది,

ఆనాడు తను భానుమూర్తిని అన్న మాటలన్నీ నెమరు వేసుకుంది. తోడికోడలు తనకు యెదురుదెబ్బ తీయడానికే యిలా అన్నదని వూహించుకుంది. కాని యేం చెయ్యగలదు? పరిస్థితి ప్రతికూలంగా వుంది. అందుకే యేమీ అనలేకపోయింది.

"జగన్నాథం ఇలాంటి పని చేస్తాడని నే నేనాడూ అనుకోలేదు. ఎంతో మంచి వాడనుకున్నాను." అన్నాడు నరహరి.

"మంచివాళ్ళు కానిదెవరండీ? వాళ్ళ అసలు రంగు బైటపడేవరకూ అందరూ మంచివాళ్ళే!" తన అక్కసు తీరి నట్టు ఒక్కోమాట అంటించుతోంది కమల.

కమల మాటకి యెవరూ యెదురు జవాబు చెప్ప లేదు. సీత యెంత మాటకారి అయినా, యిప్పుడు మాత్రం ఆమె నోటికి తాళం పడింది. వివాదం పెంచుకుంటే విమర్శలు వస్తాయన్న భయంవల్లనే వూరుకుంది.

"అన్ని యేర్పాట్లూ చేసుకుని వున్నానుకదా యిప్పుడేం చెయ్యడం?" రెండు చేతుల్తో తలపట్టుకుని బాధగా అన్నాడు నరహరి. అతని ఆవేదన అంతా యింతా కాదు.

అనంతం, సీత మొహాలు చూసుకున్నారు. కాని యేమీ అనలేదు. కమలమాత్రం కలిగించుకుంది.

"ఎందుకండీ అంతగా బాధపడతారు? ఇంతా చూస్తే బ్యాండు వాళ్ళకీ, బ్రాహ్మడికీ బయానా యిచ్చారంతేగా. వాళ్లకి నచ్చచెప్పి డబ్బు తీసుకోండి. ఇవ్వమంటే

వదిలేయండి. తయారుచేసిన తినుబడి పదార్థాలన్నీ మనం వాడుకుంటాం.... మరేంచేస్తాం....” అంది ధైర్యం చెప్తూ.

కాని, నరహరికి యిదో పరీక్షలా తోచింది. అతని హృదయం కోపంతో రగిలిపోతోంది. కాని, యేం చెయ్య గలడు? పెళ్ళి ఆగిపోయిందంటే రాబోయే పరిణామాల్ని ఒక్కసారి వూహించుకున్నాడు. ఆపాదమస్తకం చలించి పోయాడు. ‘ఎందుకు పెళ్లిని ఆపేయాలి? అదే ముహూర్తా నికి, మరో సంబంధం చూసి పెళ్ళిచేస్తే?....’అన్న ఆలోచన అతనిలో మెరుపులా మెరిసింది....అతనిలో ఉద్రేకం రెచ్చింది. “సంబంధం తప్పినంత మాత్రాన పెళ్ళి మానే స్తారా! అదెంత తలవంపు? ఈ ముహూర్తానికి పెళ్ళి తప్పి పోతే అమ్మాయి జీవితం ఏమాతుంది? లోకులు యేమను కుంటారు? ఉన్న విషయాన్ని తెలుసుకుందుకు యెవరు ప్రయత్నిస్తారు? నేను మాత్రం నలుగుర్లో తలెత్తుకు తిరగ వద్దూ? అలా జరగదు.... పెళ్ళి ఆగదు. అదే ముహూర్తా నికి పెళ్ళి జరిపి తీరతాను....” అన్నాడు ఉద్రేకంతో.

కమల యింకేమీ అనలేదు. ఏమన్నా వినే స్థితిలో ఆయన లేరని ఆమెకి తెలుసు. అనంతం తనకి వ్యక్తిత్వం లేనట్టుగా భార్యవేపు చూశాడు.

“ఔను బావా! మీ ఆలోచన బావుంది” అంది సీత. తనుమీద నిష్ఠూరం పడకుండా వుండడమే చాలన్న ట్టుగా. “నువ్వు తల్చుకుంటే, సంబంధాలకి కొదవేవిటి న్నయ్యా!” వంతపాట పాడాడు అనంతం.

"ఏదో ఒహటి చెయ్యానూమరి? మీరంతా నన్ను వుద్ధరించడానికి యీ సంబంధం తెచ్చారు. లేకపోతే సలక్షణమైన మరో సంబంధం చూసుకుని వుండేవాణ్ణిగా!" వుక్రోషంతో అన్నాడు నరహరి. అతని కళ్ళు నిప్పురవ్వల్లా మెరుస్తున్నాయి.

సీత మొహం వాడిపోయింది. జవాబు యేం చెబుతుంది? ధైర్యం చాలిందికాదు.

ప్రక్క గదిలోంచి అంతా వింటున్న సరస్వతి ద్వారం దగ్గరకి వచ్చింది. ఆమె మొహం యెవరూ పరిశీలించి చూళ్ళేదు గాని జేవురించి వుంది "ప్రస్తుతానికి మీరే సంబంధమూ చూడొద్దు నాన్నా! పెళ్ళిచేసుకునే తలంపు నాకు లేదు. మీ మాట కాదనలేక యిన్నాళ్ళూ తలూపుతూ వచ్చాను కాని, నా పెళ్ళివిషయం తలచుకుంటుంటే నాకే తలవంపుగా వుంది. ధైర్యంచేసి మీతో యివన్నీ అంటున్నానని మరో విధంగా అనుకోకండి. నా మనసులో బాధ మీకు అర్థంకాదు. మొదట్లో మావయ్యకిచ్చి పెళ్ళిచేస్తామన్నారు. కాని, క్రమంగా మీరే ఆ ఆలోచనను మీ మనసునుండి తప్పించేశారు. దాని ఫలితంగానే అనుకోండి, మావయ్య ఓ అమ్మాయిని లేవదీసుకుపోయాడు. ఆనాడు మీరు నన్ను మావయ్యకే యిచ్చి వివాహం చేసివుంటే, మావయ్య జీవితం యింకోలా వుండేది. ఇప్పుడీ సంబంధం చూశారు. యిదీ యీ విధంగా

తప్పింది. మీరు చూసే ప్రతీసంబంధమూ మీ వల్లనో, మరో కారణం వల్లనో తప్పిపోతూవుంటే, వీటన్నింటికీ నాంది అయిన నామనస్సు ఎలావుంటుంటో ఆలోచించండి. నామీద మీకు యేపాటి అభిమానం, అనురాగం వున్నట్టయితే నాపెళ్ళి ప్రయత్నం మానుకోండి" గడగడ చెప్పేసి లోపలికి పోయింది.

అనుకోకుండా పెద్దకుషానువచ్చినా అంతగా ఆశ్చర్యపోరుగాని, యెప్పుడూ ఉద్రేకంగా మాట్లాడని సరస్వతి ఆ రోజు ఆ విధంగా మాట్లాడ్డం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

కమల కూతురి బాధను గ్రహించి ఆమె వున్న గదిలోకి పోయింది.

నరహరి నిర్ఘాంతపోయి రాతివిగ్రహంలా స్తబ్దుగా వుండిపోయాడు. అతని మెదడు మాత్రం జోరుగా పని చేస్తోంది. ఆనాడు భానుమూర్తికే సరస్వతినిచ్చి వివాహం చేసేస్తే, యీసమస్యలన్నీ వుండకపోనేమో ననుకున్నాడు. తన తప్పునే వ్యక్తంచేస్తూ కూతురు మాట్లాడిందనికూడా వూహించాడు. నిజంగా తప్పు తనదే! మళ్ళీ ఆమెకిష్టంలేని ప్రయత్నంచేసి, ఆ పసి హృదయాన్ని గాయపర్చడం తనకి భావ్యం కాదేమో ననుకున్నాడు. ఆలోచించినకొద్దీ కూతురి మనోవ్యథ అవగతమౌతూవుంది.

"దానికి యిష్టంలేని పెళ్ళిచేసి నేను సుఖపడేదేమిటి? చదుకోవాలన్న అభిలాషవుందేమో! చదువుకోనీ" తనలో

తనే గట్టిగాగొణుక్కున్నాడు నరహరి, కళ్ళల్లో నీరుతిరుగు తూంటే.

"ఔను బావా! లక్షణంగా చదువుకోనీయండి. చదువులో దానికి యెంతో ఆసక్తివుంది కూడాను" అంది సీత. ఈమనిషే ఒకప్పుడు చదువుకుని సాధించేదేవిఁటీ అని సరస్వతిని నిలదీసి అడిగింది.

"మా సరస్వతి యే లేడీడాక్టరో అయితే మాకూ మంచిదే?" అన్నాడు అనంతం.

నరహరి యేమీ మాట్లాడకుండా బైటికి నడిచాడు భారంగా అడుఁగులు వేసుకుంటూ.

సీత భర్తవేపు తీక్షణంగా చూసింది. "మీకు యెన్ని సార్లు చెప్పాను మాట్లాడవద్దని. తగుదునమ్మా అని ప్రతి దాంట్లోకీ వస్తారు" అంది చీదరించుకుంటూ.

"నేనేం యెక్కువ మాట్లాడలేదు! రెండుసార్లేగా మాట్లాడాను! అవైనా నువ్వు అంటున్నవే వల్లవేశాను" అన్నాడు అనంతం మెల్లగా. ఏవిఁటో అతనికి అంతభయం!. "అవైనా యిక్కడ వద్దనిచెప్పానుగా?" అంది ఆజ్ఞాపిస్తున్నట్లుగా.

"సరే! అలాగే" అనేశాడు.

కమల కూతురుగదిలోంచి వస్తూ "లేవండి సీతా! స్నానం చేద్దురుగాని" అంటూ వంటగదివేపు త్రోవతీసింది. సీత ఆమెను అనుసరించింది. అనంతం నిట్టూర్పు విడుస్తూ కుర్చీలో జేరబడ్డాడు.

# 15

భానుమూర్తి దగ్గర్నించి వుత్తరం వచ్చింది. నరహరి వుత్తరాన్ని చదివి కమలకి అందిస్తూ "స్వంతయింటికి వెళ్ళిపోయారట. మనల్ని ఓసారి రమ్మని రాశాడు కూడాను" అన్నాడు.

కమల చిన్నగా నవ్వుకుంది. తమ్ముడు యెలాగో ఓ యింటివాడై, హాయిగా సంసారం గడుపుకుంటున్నాడన్నదే ఆమె ఆనందానికి కారణం. సరస్వతి అప్పుడే గదినుండి బైటికి వచ్చేసరికి కమల పిల్చింది. "మీ మావయ్య వుత్తరం రాశాడే మనల్ని రమ్మనమని, నిన్ను తీసుకురమ్మని మరీమరీ కోరుతూ రాశాడు" నవ్వుతూ అంది కమల.

ఒకప్పుడు మావయ్యగారింటికి వెళ్ళడానికి మనస్కరించక, వంట్లో బాగులేదన్న నెపంతో వుండిపోయింది సరస్వతి. తనూ పెళ్ళిచేసుకుని ఓయింటివాడయ్యాక వెళ్ళాలన్న వుద్దేశంతో వుండేది. కాని పెళ్ళి చేసుకోవాలన్న తలంపు ఆమెలో లేకపోవడంతో, మనోనిర్ణయాన్ని మార్చుకుంది. మావయ్య భార్యనీ, వాళ్ళ సంసారాన్నీ చూడాలన్న వాంఛ కలిగిందామెలో.

"అలాగేనమ్మా వెళ్దాం ..." అంది వుత్సాహంగా.

ముగ్గురూ విశాఖపట్నం బయలుదేరారు వస్తున్నట్టు భానుమూర్తికి ముందుగా టెలిగ్రామ్ యిచ్చాడు నరహరి.

భానుమూర్తి స్టేషనుకివచ్చాడు. ఉత్సాహంగా అం దర్నీ పలుకరించాడు. నువ్వేమిటలా సిరసించి పోతున్నావ్ సరస్వతీ?" పరిహాసంగా అన్నాడు. సరస్వతి చిరునవ్వుతో మౌనం వహించింది.

అందరూ యింటికి పోయారు. సావిత్రి కమలకి, నర హరికి నమస్కారం చేసింది. సరస్వతిని ఆప్యాయంగా దగ్గ రికి తీసుకుని మాట్లాడింది. యెంతటి ఆత్మీయులైనా అంత సన్నిహితంగా వుంటారా అన్న ఆలోచనను వాళ్ళల్లో రేపింది సావిత్రి.

సావిత్రిని కనురెప్ప వెయ్యకుండా చూసింది కమల. మురిసిపోయింది. అందం, అందానికితగ్గ అణకువ, సలక్షణ మైన నయనాలూ ఆమెను ముగ్ధురాల్ని చేశాయి. ఆమె తనకూతురికి యెందులోనూ తీసిపోనట్టుగా వుందనుకుంది కమల. భర్తవేపు అదోలాచూసింది. 'చూశారా మా మర దలు యెంత బావుందో! మీ అమ్మాయిని ఇవ్వకపోతేనేం?' అన్నట్టుగా వున్నాయి ఆ చూపులు. నరహరి మొహం దించుకున్నాడు. యశోదమ్మ హడావిడిగా వంటయేర్పాట్లు చేస్తోంది.

సరస్వతి బాహ్యంగా యెలావున్నా అంతర్గతంగా కుమిలిపోతూవుంది. 'ఈ ఇంట్లో కోడలిగా అడుగుపెట్టాల్సింది తను, కాని ఆ అదృష్టం తనకి లేకపోయింది. దానికి కారకులు నాన్న!' అనుకున్న సరస్వతి తండ్రివేపు చూసింది. ఆ చూపుల్లో నిబిడీకృతమైవున్న క్రోధానికి,తీక్ష్ణతకూ తట్టుకో లేకపోయాడు నరహరి. తప్పుచేసినవాడిలా మొహం

దించేసుకున్నాడు. అందరూ తననే నిందిస్తున్నారన్న బాధ అతణ్ణి కలవరపర్చింది.

భోజనాలయ్యాక నరహరి, భానుమూర్తి, యశోదమ్మ, కమల కూచుని మాట్లాడుకుంటున్నారు. సావిత్రి మాత్రం సరస్వతిని తీసుకుపోయి మరోగదిలో కూర్చుంది. వాళ్ళిద్దరికీ పూర్వపరిచయం మేమీ లేకపోయినా, ఎంతో సన్నిహితుల్లా ప్రవర్తిస్తున్నారు. సావిత్రితో మాట్లాడుతూ కూర్చోవడం సరస్వతికీ హాయిగానే వుంది.

మాటలమధ్యలో భానుమూర్తి అన్నాడు. "సరస్వతికి పెళ్ళి నిశ్చయ మయిందన్నారు. మరి శుభలేఖ లేవి?" అన్నాడు.

కమల భర్త మొఖంలోకి చూసింది అదోలా. నరహరి కుంచించుకుపోయాడు. జవాబు చెప్పలేకపోయాడు.

"నిశ్చయమవ్వడం, తప్పిపోవడం అన్నీ జరిగిపోయాయిరా" అంది కమల బాధగా.

"ఏం ? ఏమయింది ?" అన్నాడు భానుమూర్తి ఆశ్చర్యంతో.

"ఆ అబ్బాయి పెళ్ళిచేసుకున్నాట్ట..." జవాబిచ్చింది కమల.

"ఎవరు జగన్నాథమా! పెళ్ళిచేసుకున్నాడా! అయితే నేను వూహించినట్టే జరిగిందన్నమాట ..." అన్నాడు భానుమూర్తి.

"వాళ్ళ వ్యవహారమంతా నీకు తెలుసునేవిటోయ్!" వింతగా బావమర్ది వేపుచూస్తూ అన్నాడు నరహరి.

భానుమూర్తి దీర్ఘంగా నిట్టూర్చి, తను ఆరోజు సావిత్రితో కలిసి సినిమాకి వెళ్ళినప్పుడు జగన్నాథం, లిల్లీ అగుపించడం అంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. "పరిచయమున్న మనిషేమో అనుకున్నానుగాని వివాహం వరకూ వస్తుందని అనుకోలేదు" అన్నాడు.

"అప్పుడే మాకు ఉత్తరంరాస్తే యెంత బావుండునోయ్?" అన్నాడు నరహరి.

"రాద్దామనే అనుకున్నాను, కాని నామాటకి విలువిస్తారో యివ్వరో, అసూయవల్ల అలా రాశానని అనుకుంటారేమోనని రాయలేదు." అన్నాడు భానుమూర్తి.

"ఏదో జరిగిపోయింది. మరేంచేస్తాంరా! ఈసంబంధమైనా మేం వెదికిందికాదు. మా తోడికోడలు ఒకటే పట్టుబట్టి ప్రాధేయపడితే మీ బావగారు 'వూఁ' కొట్టారు" అంది కమల.

"ఔను నాకంటే ఆ జగన్నాథమే మీదృష్టిలో ఉత్తముడిగా, యోగ్యుడిగా అగుపించాడు...." బాధగా కసిగా అన్నాడు భానుమూర్తి.

కమల యేమీ అనలేకపోయింది కాని నరహరి కలవరపడ్డాడు. భానుమూర్తి తనని నిందించడంలో తప్పేమీ లేదనుకున్నాడు. ఆనిందకు తను అర్హుడే అనుకున్నాడు.

"అవన్నీ మరి జ్ఞప్తికి తీసుకురాకు మూర్తీ! తప్పంతా నాదేను! నాతప్పుకి శిక్ష ఇప్పుడు అనుభవిస్తున్నానుకదూ!" కుమిలిపోతూ రుద్ధకంఠంతో అన్నాడు నరహరి.

"అయినా అబ్బాయ్! నువ్వు ఇప్పుడవన్నీ ఎందుకు యెత్తిపొడవడంరా?" అంది యశోదమ్మ.

"అననీ అత్తయ్యా! తప్పులేదు. ఆ నిందలకు నేను అర్హుణ్నే!" అన్నాడు నిర్లిప్తంగా నరహరి.

"అలా అనుకోకు బావా! యేదో మాటవరసకు అన్నానుగాని, నిన్ను నొప్పించాలని కాదు...." అంటూ సావిత్రి, సరస్వతి మాట్లాడుకుంటున్న గదిలోకి దారితీశాడు భానుమూర్తి.

సావిత్రి లేచి నుంచుంది. సరస్వతికూడా లేవబోయింది. కాని భానుమూర్తి కలిగించుకుని "నువ్వు కూర్చో సరస్వతీ! మీఅక్కయ్య హిందూ సతీధర్మాన్ని నిర్వర్తించింది.... నువ్వు లేవడమెందుకూ?" అన్నాడు నవ్వుతూ.

"పోదురూ! ఎప్పుడూ ఇంతేనమ్మా మీమావయ్య, ఇప్పుడే వస్తాను. మాట్లాడుతూవుండండి...."అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది సావిత్రి.

భానుమూర్తి సరస్వతికి కాస్తదూరంలో వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఏం సరస్వతీ! మీఅక్కపై నీఅభిప్రాయం ఏమిటి" అన్నాడు.

"ఏం చెప్పను? అందంగావుంది...."

"అందచందాలు గురించి నేను అడగలేదు. ఆమె ప్రవర్తన యెట్లావుంది? అందరితో ఆత్మీయతగా తిరుగుతోందా? మెల్లగా అన్నాడు, సావిత్రివింటే బావుండదని.

"చూస్తున్నాంకదా మావయ్యా! ఆమె వినయం,

విధేయత, ఆత్మీయతా యెవరికీ తీసిపోవు. నిజంగా నువ్వు అదృష్టవంతుడివి. అక్క నీకంటె అదృష్టవంతురాలు. అందుకే నిన్ను భర్తగా పొందగలిగింది. ఈ ఇంట్లో కోడలుగా మసలుతోంది. దేనికైనా రాతవుండాలి మావయ్యా!" అప్రయత్నంగా ఆ మాటలు ఆమెనోట వచ్చేశాయి. ఇంక అక్కడ నిల్చోలేక చరచరా బయటికి నడిచిపోయింది.

సరస్వతి మాటలకు నిర్విణ్ణుడైపోయాడు భానుమూర్తి. భావగర్భితంగా అంటున్న ఆమెమాటలలోని వుద్వేగాన్ని అర్థంచేసుకున్నాడు. ఆమె కళ్ళల్లో దోబూచు లాడుతున్న అశ్రువులుచూచి యెంతో బాధపడ్డాడు. "జీవితంలో అడుగడుగునా, పరాజయాన్ని కౌగలించు కుంటున్నది పాపం" అనుకున్నాడు గట్టిగా నిట్టూరుస్తూ.

సరస్వతి అన్నమాటలు పక్కగదిలోవున్న నరహరికి మెల్లగా వినిపించాయి. ఒక్కోమాటా అతనికి ములుకుల్లా బోధించాయి. అతనికళ్ళు ఆర్ద్రమయ్యాయి., కూతురి మనసులోని భావం సాంతం ఈరోజు అవగాహనచేసుకున్నాడు. కాని, యేం లాభం? తరుణం మించిపోయింది. ఆమె మనసుని గ్రహించలేక తను స్వతంత్రించి ప్రవర్తించాడు. ఆమెను మానసికంగా కృంగజేశాడు. తనుచేసిన తప్పుకి ప్రాయశ్చిత్తం యేమిటి?... అనుకున్నాడు.

యింతలో సీతారామయ్య, తులశమ్మ వచ్చారు. వాళ్ళనుచూసి లేచినుంచున్నాడు నరహరి. మనసులో బాధవున్నా, కృత్రిమంగా నవ్వు తెచ్చి పెట్టుకుంటూ "రండి... రండి" అన్నాడు.

సీతారామయ్య, నరహరికి యెదురుగావున్న కుర్చీలో ఆసీనుడయ్యాడు. తులశమ్మ యశోదమ్మ ప్రక్కనే కూచున్నది. "అందరం ఒకదగ్గర కలుసుకోవడం, యెంతో ఆనందంగా వున్నదండీ!" అన్నాడు సీతారామయ్య నవ్వుతూ.

'ఆనాటి సీతారామయ్యేనా, యిప్పుడింత శాంతంగా మాట్లాడుతున్నది?' అని విస్తుపోయాడు నరహరి. అంత పౌరుషం, క్రోధం, పట్టుదల యిప్పుడితనిలో యేమయ్యాయి? ఆలోచించినమీదట అతనికి అర్థమయ్యింది పరిస్థితుల ప్రభావానికి అంతా ఓటమిని అంగీకరించవల్సిందేనని.

"నిజమేనండీ! మాకూ ఆనందంగానే వుంది.... అంతా మా బావమర్ది చలవ...." నవ్వుతూనే అంటూ కూచున్నాడు నరహరి.

వంట గదినుండి అప్పుడేవచ్చిన సావిత్రి తలిదండ్రుల్ని చిరునవ్వుతో పలుకరించి, భర్త వున్న గదిలోకి వెళ్ళింది. సరస్వతి అక్కడలేదని ఆమెకి తెలుసు....కాని, భర్త దిగులుగా వుండడం గుర్తించి ఆందోళన పడింది. "ఏమయిందండీ? అలావున్నారేం? అంది ఆత్రుతగా.

భానుమూర్తి మొదట్లో తడబడ్డాడు కాని క్రమంగా సంబాళించుకున్నాడు.

"అబ్బే ఏమీలేదు సావిత్రీ! సరస్వతి వివాహంతప్పిపోయింది కదా అని విచారిస్తున్నాను...." అన్నాడు యేదో సమాధానం చెప్పాలి గనుక.

"నిజంగా విచారించవలసిన విషయమే! ఆమెలో యెంత నిరుత్సాహం నిబిడీకృతమై వుంటుందో ఆలోచిం

చండి, అయినా మెవరేం చేస్తాం? పరిస్థితులు అనుకూలించకపోతే అనుకున్నదేమీ జరగదు. అంతా విధి నిర్ణయం! అమ్మా, నాన్నా వచ్చారు పదండి...” అంటూ మళ్ళీ వెళ్ళిపోయింది వంటగది వేపు.

భానుమూర్తి గదినుండి బైటికి వచ్చాడు. అత్తా మామలను పలుకరించాడు.

“ఏవిఁటో మా అల్లుడు మా అమ్మాయితో మళ్ళీ మంతనాలు జరుపుతున్నాడు! మళ్ళీ మెక్కడికైనా వుడాయిస్తున్నారేవిఁటి?” పరిహాసంగా నవ్వుతూ అన్నాడు సీతారామయ్య..

అందరూ ఫకాలున నవ్వారు. సీతారామయ్యగారు అంత హాస్యధోరణిలో మాట్లాడగలరని అంతవరకూ అనుకోలేదు నరహరి. భానుమూర్తి మాత్రం పేలవంగా నవ్వేడు.

“అబ్బే! అలాంటి ప్రయత్నమేమీ లేదండీ! ఇక మీదట ఒక్కచోటకే వెళ్ళాలన్న తలంపు వుంది. చేసిన తప్పుకి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని తిరుపతి వెంకటేశ్వర స్వామి సందర్శనం చేసుకోవాలనివుంది....” అన్నాడు.

ఆమాట నరహరికి చాకుపోటులా తగిలింది. అందరి కంటే క్షమించరాని తప్పుచేశాడు తను, తను చేసిన తప్పు, ఎంతో మంది హృదయాలను గాయపర్చింది. నిజంగా అది ఒక విశేషమైన పాపమే! ఆ పాపాన్ని ప్రక్షాళితం చేసుకుందుకు తనూ తిరుపతి పోయి శ్రీ వెంకటేశ్వరస్వామివారి పాదాలపై పడాలి అనుకున్నాడు. “జానోయ్ మూర్తీ! బాగా

గుర్తుకు తెచ్చావు. పద.... మేంకూడా వస్తాం....”అన్నాడు నరహరి.

భానుమూర్తి గతుక్కుమన్నాడు. తను యేదోమాట వరసకు అంటే, అందరూ దాన్ని నిర్ధారణగా తీసుకున్నారే, అనుకున్నాడు.

“మీరంతా వెళ్తుంటే, మేమేనా వుండిపోతాం.... మేంకూడా వస్తాం....” అన్నాడు సీతారామయ్య. తులశమ్మ ఉత్సాహంగా భర్తవేపు చూసింది.

“ప్రయత్నం లేకుండా యీ ప్రస్తావన వచ్చింది. ప్రయాణ సన్నాహాలు చెయ్యండి.... యెన్నాళ్ళ నుంచో నేనూ అనుకుంటున్నాను వెళ్ళాలని....” అంది యశోదమ్మ.

అందరూ ఒకనిర్ణయానికి వచ్చారు.

అప్పుడే సావిత్రి అందరికీ కాఫీలు తెచ్చి యిచ్చింది. కాఫీలు సేవించాక, సీతారామయ్య దంపతులు వెళ్ళిపోయారు.

“అమ్మాయేదీ ?” అన్నాడు నరహరి, కమలని వుద్దేశించి.

“వంటగది దగ్గర ఒంటరిగా కూచుంది....” అంటూనే పెరట్లోకి వెళ్ళిపోయింది కమల.

నరహరి లేచి ద్వారంవరకూ వెళ్ళాడు. ఒంటరిగా, దీనంగా గంపెడు దుఃఖాన్ని గుండెల్లో దాచుకున్నట్టుగా దిగులుగా కూచుంది సరస్వతి. నరహరి గుండెలు తరుక్కుపోయాయి. కూతురు అవ్యక్తమైన ఆవేదన అనుభవిస్తున్నదని అర్థం చేసుకుందుకు అట్టే సమయం పట్టలేదతనికి.

అతనిలో ఒకవిధమైన సంక్షోభం చెలరేగింది. వేదన వరద వెల్లువలా ప్రవహించింది. వస్తున్న కన్నీటిని ఆపుకుని వెనక్కి వెళ్ళిపోయి కుర్చీలో కూలబడ్డాడు. 'నేను నీకు అన్యాయం చేశాను సరస్వతీ!' అనుకున్నాడు మన సులో. కాని నిజానికి అతని తప్పు మాత్రం యేముంది? ఆమె సౌఖ్యంకోసం, మంచికోసం, ప్రతి పనీ చేశాడు..... పరిస్థితులకు లొంగి అలా చేశాడు. కాని, ఆపరిస్థితులే ఆమె బ్రతుకును నిస్సారం చేశాయి.

"ఇంతకీ సరస్వతి భవిష్యత్తును ఎలా నిర్ణయించారు బావా?" అన్నాడు భానుమూర్తి. నరహరిలో సంచలనం అతను గ్రహించ గలిగాడు.

"నేను నిర్ణయించేదేమిటీ? ఇంక పెళ్ళి ప్రయత్నాలు చెయ్యొద్దని ఖచ్చితంగా చెప్పేసింది. యింక మనం యేం చేస్తాం!" అన్నాడు భారంగా నరహరి.

భానుమూర్తి ఒక్క నిట్టూర్పు విడువడం తప్పించి, యింకేమీ జవాబు చెప్పలేక పోయాడు.







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B101 |
| పుస్తకం పేరు | విధివంచితులు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | 1-4 |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |